# ఘజల్ రామాయణం



వసంతరాయ్

వెల 80-00 రు,లు

ప్రపంచ శాంతి పబ్లికేషన్స్
C/o శ్రీ వెంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్
మిర్యాలగూడ-508207, నల్లగొండ జిల్లా

# GHAJAL RAMAYANAM

## By VASANTHA ROY

FIRST EDITION 26 6 94

1000 COPIES

PRICE RS 80-00

**Printed at**
**Sri Venkateshwara Printing Press**
**Opp: M.p.p Miryalaguda.**

**publishers**
**Prapancha Shanthi Publications**
C/O SRI VENKATESHWARA PRINTING PRESS
OPP; M.P P MIRYALAGUDA—508207
NALGONDA DT A P.

# కృతజ్ఞతలు



తిరుమల తిరుపతి దేవస్థానం ఎయిడ్ టు ఆథర్స్ స్కీం ఆర్థిక సహాయంతో ఈ పుస్తకం ప్రచురించబడింది.

ఈ గ్రంథంలోని రచయిత అభిప్రాయాలతో టి.టి.డి. వారికి ఎలాంటి సంబంధమూ లేదు.

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన టిటిడి వారికి మా కృతజ్ఞతలు.



— తోట వసంతరాయ్

## సవరణలు

1. 9వ అధ్యాయంలోని మొదటి ఘజల్ [పాటను] అదే అధ్యాయంలో చిట్ట చివరగా చదువుకోవాలి. ప్రింటింగ్ లో జరిగిన ఈ పొరపాటుకు చింతిస్తున్నాం.
2. 63 వ పేజీలో చివరి ఘజల్ 2 వ పాదం దీటుగా నిలబడి రాముడు రావణుపైన విడువ బాణముల అసి

# ఘజల్ రామాయణం

## 1

ఘజల్ : రామా! నీ నామమే మాకు వేదం; శ్రీ
రామా! నీ కావ్యమే మాకు మధురం. ॥శ్రీరామా॥
కళ్యాణరామ కమనీయనామ
కోదండరామ - పట్టాభిరామ ॥శ్రీరామా॥

చరణం 1. అదె అయోధ్యా నగరము
అదే మహారాజ మందిరము
అతడు అరివీర భయంకరుడు
అమృతతుల్యుడు దశరథుడు.

2. అతనికి భార్యలు మువ్వురూ
కౌసల్యా, సుమిత్రా, కైకేయి
ఒకరు అమృతహస్తిని, ఇం
కొకరు అందాలభరిణ, వే
రొకరు చపలచిత్త, చదుర,
వాగ్బాణ హరిణ! ॥రామా॥

పద్యం : ప్రజలు సుఖశాంత చిత్తులై ప్రబలుచుండ
ఫలము లీనుచు వృక్షాలు ఫలితమీయ
జలము లాయెడ సమృద్ధి జననమంద
వెలసె నా సిరి అయోధ్య ప్రజల చెంత,

ఘజల్ 1. సంతానమే లేక; మది సంతసము లేక
సద్గతులు లేక, సౌభాగ్యమే లేక
మనసు క్రుంగగా, మదిని చింతించె నా
మహారాజు! ధరణి నెల్లను
పాలించు దశరథ మహారాజు !

2. సంతానమును కోరి పుత్రకామేష్టి
యజ్ఞమే సేయుమని మునులు సూచించగా
తనదు సంతోష, సంపదలెల్ల గలిపి
యజ్ఞమును నిర్వహించె నా రాజరాజు!

3. యజ్ఞపురుషుడు ప్రత్యక్ష మాయెనంత
దశరథా! నీకు పుత్రసౌభాగ్య మిదిగో!
యనుచు పాయస పాత్రను చేతనిడగా—
ధన్యుడను! స్వామి! నా జన్మ ధన్యమాయె
ననుచు దశరథు డద్దాని పట్టమహిషి
హస్తముల జేర్చి యానందపడెను గాదె!

పద్యం : ఆమె, కౌసల్య తనచేతి పాయసమ్మ
సగము కైకేయి కిచ్చెను, అంతలోన
వచ్చెను సుమిత్ర, ఆమెకు భాగ మిచ్చి
నార లిరువురు, ఆనందపడిరి వారు!

చరణం : అంత కొన్నాళ్ళకు ముగ్గురు సవతులు గర్భవతులై
నవమాసములకు నలుగురు పుత్రులకు జన్మనిచ్చిరి.

పద్యం : ధరణి లోపల విలువైన ముద్రవేసి
ప్రజల మనసున నిలచిన ప్రభువు ఎవడు?
వేద వేదాంత విద్యలకన్న తనదు
జీవనమె గొప్ప గ్రంథమ్మ జేసె నెవడు?

తన ప్రవర్తన భవిష్యత్ ప్రపంచమెల్ల
దారిగా తల్చు విధమున నడచె నెవడు?

అట్టి శ్రీరామచంద్రు డా ఉదయమందు
జననమందెను కౌసల్య గర్భమందు
భరత, లక్ష్మణ, శత్రుఘ్ను లనుజులవగ
చెలగి ఆ అయోధ్యా పుర విభుడు, ప్రజలు
సకల దేవత, లెల్ల జనహితులు గూడి
డెందముల శాంతముప్పొంగి సంతసింప!

వచనం : ఆనందోత్సాహముతో దశరథ మహారాజు తన రాజ్యమంతటా విజయోత్సవములు నిర్వహించెను. అట్టియెడ దశరథమహారాజు దినచర్య ఎట్టిదనిన

పద్యం : ఉదయమే లేచి రాముని ముఖము జూచి
కోర్కె దీరగ పుత్రుల కూర్మి జేసి
వారితో జేరి యాటల నాడుకొనును
వారినే గూడి కాలము వెళ్ళదీయు!

పద్యం : బాలురకు పదునాల్గు వయసులోన
గురు కులమ్మున విలువిద్య నభ్యసించ
పనిచె దశరథ మహారాజు తనదు పుత్ర
ప్రేమ దీరక వగచుచు ప్రీతితోడ

ఘజల్ : అతడు శ్రీరాముడదిగో ఆ విల్లు నంది
విడిచె బాణము విహ్వల మవగ జగతి.
కుల పురోహితు డా వశిష్ఠమౌని ముందు
మార్గదర్శకుడై నడయాడుచుండ
వివిధ విలువిద్యలను నేర్చుకొనెను తాను!
అనుజులెల్లరు తనతోడు నీడకాగ
ధరణి పులకించి పూలవానలు జెలంగ
సురలు, నరులును ఆనంద మంది చూడ.



# 2

ఘజల్: 1. ఘనుడు విశ్వామిత్రు డవనిపై నొక యజ్ఞమును సేయ
ఆశ్రమంబున యజ్ఞవాటికను నిర్మించి,
ముదమారగా యజ్ఞమును సేయగా బూనె!

2. అదుగో తాటక ఆకాశంలో
భువినే అదరగ జేసెను వికృత ఘీంకృత చర్యల
రాక్షస మాయతోడుత, రక్తమాంసములు
ఖండఖండముల యజ్ఞవాటికను
పడజేయుచు మునులను బాధలు పెట్టగ!

3. తల్లి వెంట తనయులు మారీచుడు
సుబాహుడను రాక్షస గణములతోడ
సురల భీతిల్ల జేసిరి, భయమున
పరుగులు తీసిరి మునులు బెదరగా!

పద్యం : భయము తోడుత పరుగిడు భవ్యమునుల
మోము జూచిన విశ్వామిత్రుండు అలిగి
రాక్షసుల జంపు శ్రీహరి రాకకొరకు
దివ్యదృష్టిని పరికించి చూసె నపుడు

పద్యం : ఎవడు రాక్షస జాతికి ఎదురు నిలచి
క్రమంద జేయగ గలడురా! మోద మలర!
అతడు శ్రీరాముడాశక్తి కలిగియుండె!
దశరథుని పుత్రు డయోధ్య పుర నివాసి!

ఘజల్ : యని మనసున తలచుకుని ఆ మౌనీంద్రుడు
తన యజ్ఞము కాచెడు వీరుని కొరకయి
అరుదెంచెను ఆ అయోధ్య నగరికి
ఏతెంచెను దశరథ భూపతి సభకు!

పద్యం : మునిని జూచిన దశరథభూమిపతియు

అర్ఘ్యపాద్యము తోడుత నాదరించి

కుశల ప్రశ్నలు వేసియు కూర్మితోడ

నతని కోరిక తెలుపగా నడిగినంత!

ఘజల్ : కార్యమొకటి ప్రారంభించితి లోకకళ్యాణ కామితార్థినై

రాక్షసమూకలు అడ్డగించెను రక్తమాంసములు గ్రుమ్మరించెను

వారి పరిమార్చ వీరుని వెదకుచు వచ్చినాడనో రాజశేఖరా!

పద్యం : యజ్ఞమును చేయతలపోసినాను నేను

అట్టి దానికి రక్షణ నీయ నీవు

నాకు వాగ్దాన మొనరించి, మునుల గావ

నీదు తనయుని శ్రీరాము నంపవయ్య

వచనం : ఈ విధంబుగా పలికిన విశ్వామిత్రుని మాటలను కాదనలేక, బాలురపై ప్రేమ వీడలేక తన మనస్సున మథనపడుచున్న దశరథునికి నచ్చజెప్పి, రామలక్ష్మణులను తన వెంట గొనిపోవగా ఆ రాజర్షి యనుమతి పొందెను.

ఘజల్ : వెడలెను శ్రీరాముడు

రాక్షసకుల విజృంభణ నణచగ

తనతోడుత లక్ష్మణు డుండగా ।వెడలెను॥

అతిలోక సుందరుడు

అరివీర భీకరుడు

సురలోక నాయకుడు

నరజాతి శ్రీకరుడు ॥వెడలెను॥

వచనం : మార్గమధ్యంబున విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు అనేక అస్త్ర, శస్త్ర ప్రయోగమ్ములు మంత్ర సహితముగా ఉపదేశించి, వారికి అద్భుతాస్త్రమ్ములను అనుగ్రహించెను. ఆపిదప రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట నడచుచుండగా, మార్గమధ్యంబున తాటక యను రాక్షసి వారిని ఎదుర్కొనెను. మొక్కవోని ధైర్యముతో శ్రీరాముడు తన అద్భుతాస్త్రములను ప్రయోగించెను.

ఘజల్ : 1. మంత్ర మొకటి పఠియించి బాణమే
విడిచెను రాముడు తాటకపై
సుంతయేని దయలేక రాక్షసిని
అంతము జేసెను అద్భుతమై!

వచనం : ఆపిదప గురుశిష్యులు యజ్ఞవాటికను చేరుకొని,
అక్కడ మునిగణములను భయభ్రాంతులను చేయుచున్న రాక్షసుల గాంచిరి.

2. మదిని సాహసము నూపిరిలూదగ
మరియొక బాణము విడిచెను రాముడు
చెదలు పుట్టలై రాక్షసవీరులు
కదన రంగమున కూలిపోవగా
మారీచుడు సంద్రమునం బడె
సుబాహు డొక క్షణమున కూలెను
మిగిలిన రాక్షసగణము భీతితో
వడివడి పరుగున పారిపోవగా ॥మంత్ర॥

వచనం : విజయులైన శ్రీరామలక్ష్మణులను జూచి, యజ్ఞవాటికలోని మునిగణము జేజేలు పలికినది. విశ్వామిత్రుండు సంతోషంబున వారిని కౌగలించుకుని, కుమారులారా! లోకకళ్యాణమునకు మీరుచేసిన కృషి భావితరమ్ముల కాదర్శమని ప్రశంసించెను. ఆపిదప గురుశిష్యులు మిథిలానగరమువైపు అరణ్య మార్గమున నడచుచుండగా రాముని పాదము తగిలి శిలగా నున్న అహల్య శాపవిమోచనము చెంది ఇట్లు స్తుతించెను.

ఘజల్ : ధన్యురాలనైతిని రామా, నీ పాదము తగిలిన కారణమున
జన్మరాహిత్యమైన విధిని నా మనసు పులకించె రామా ॥ధన్య॥

దోషము లేకున్న నేమి శాపవశము నైతినయ్యా!
మహిళగ జన్మించి యిట్లు మనసున దుఃఖిలితినయా ॥ధన్య॥

జన్మమేల? ఈ శరీర మేల?
కాలమెల్ల నిన్ను తలచుకొనుచు తపము సేతునయ్యా
నన్నుగాచి! నాకు మోక్షమిచ్చి బ్రోవవయ్యా! ॥ధన్య॥

వచనం : అనంతరము రామలక్ష్మణులను గాంచిన విశ్వామిత్రుడు కుమారులారా! జగత్కళ్యా ణమునకు

ఇది నాందియై ప్రపంచ చరిత్రకు మరోమలుపు కాగలదు. కొలది దినములలో జనకరాజ పుత్రిక సీతాదేవి స్వయంవరమున్నది. మనము ఇటునుండి మిథిలానగరమునకు వెళ్ళి ఆ స్వయంవరమున పాల్గొని విజయులమై రావలెనని కోరగా శ్రీరాముడు సమ్మతించెను.

ఘజల్ : 1. ఘనుడు రాఘవుడు పాదచారియై
ఝణ ఝణ నడువగ ప్రకృతి పులకితయై
పూలతోడుతను స్వాగతించెను
పిల్ల గాలులతో పలకరించెను
రామలక్ష్మణుల నాదరించెను
పూల పుప్పొడుల దారి బరచెను. ॥ఘను॥

2. మొదట విశ్వామిత్రు డతనివెంట
రఘుకులాగ్రజు డాతని వెంట నంటి
లక్ష్మణుండును నడువగా ధరణి మురిసె! ॥ఘను॥

వచనం : కొలది దినములు ప్రయాణించి, మిథిలా నగరము చేరుకున్నారు గురుశిష్యులు. ఆ నగర శోభ అద్భుతము.

పద్యం 1. బంగారు రంగారు భాగ్యంపు కాంతితో
కన్పించు నే యింటి కడపయైన!
ముత్యాల ముగ్గుతో ముంగిట నిల్వగా
నందమ్ము చిందు నే యతివయైన!
ఆకాశమును తాకు నందమ్ముగా నున్న
పెళ్ళిపందిరులు యే పేటనైన
ప్రతి యింటిలో పెళ్ళి పల్కించగా తీర
దన్నట్లుగా నుండె పులకరించ

2. నగరి యందమ్ము చెప్పగా నలవిగాదు
ప్రజల సంబర మెంతయో పలుకరాదు
జనక భూపతి ముద్దుల జాతసీత
పరిణయంబంచు తెల్పును పలుకరించ

వచనం : నగర సౌందర్యమును తిలకించుచు విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు జనకభూపతి సభా భవనమును చేరుకొన్నారు.

పద్యం : సీత మహానుజాత; మహనీయ మనోహర దివ్యమూర్తి సం
జాత; పసిండిమేను మహజాత; ధరిత్రిని సాటిలేనిదా
భూతదయాంబురాశి, గుణభూరుహమై వెలుగొందు ముగ్ధ; సం
జాత, త్రిలోకరూప; జనకాత్మజ, యాసభ ముందు నిల్వగన్.

వచనం : అంతట జనకమహారాజు సభాసదుల నుద్దేశించి

ఘజల్ : ఇదుగో శివధనువు కనుడీ
ఇదె, దీని నెక్కిడగ రండి! ॥ఇదుగో॥
ఎవ్వాడు ఈ ధనువు నెక్కిడునో వానిని
సీతమ్మ వరియించు వినుడీ!

2. యనినంతనే రాజు లరయంగ లేచి,
ఒక్కొక్కరే విల్లు విరువంగ బూని,
ఆశల ఊహలు అల్లుకొనంగా
ఆత్రముగా నడయాడిరి ముందుకు ॥ఇదుగో॥

3. యోధానయోధులు వీరులు - ధీరులు
అరివీర భయంకరులు - ధరాధిపులు
ఆశతో అడుగిడిరి - ఆనందపడిరి
విల్లు నెక్కిడలేక - యవమానపడిరి ॥ఇదుగో॥

వచనం : ఈ విధంబుగా పలువురు రాజశేఖరులు ధనువు నెత్తలేక యవమానపడగా, గురువు నాజ్ఞనొంది శ్రీరాముడు ముందు కడుగువేసెను. ఆతని జూచిన రాజులాశ్చర్య పడుచుండగా, రాఘవుడు ధనువు సమీపించి, వామహస్తంబున పైకి లేపి దక్షిహస్తంబున వింటినారిని బలముగా లాగినంతనే.

పద్యం : పెళపెళలాడె గాండివము ఫెళ్ళని భంగముగాగ, సీతకున్
కళకళలాడె కన్నులు; సకాంతులు నిండగ వేదికన్ నరుల్
కళవళ మందిపోయిరి; సగర్వముగా నిలుచుండె రాముడున్
కలకలమాయె మండపము; కారణజన్ముని కాంచినంతనే!

వచనం : మెరుపు మెరిసినటుల, ఉరుము ఉరిమినటుల క్షణకాలమున ధనుర్భంగమై, సీత మనసులో శ్రీరాముడు పులకింతలు కల్పించగా

పద్యం : కన్నులు సిగ్గుతో వెలిగె, కాంతులు చిందెను చెక్కుటద్దముల్.
మేనున సర్వభాగములు యేర్పడగా పులకించె నమ్మహా
భాసుని, రామచంద్ర పరిభాసుని గాంచగ సంతసంబునన్
జానకి, హస్తముల్ వణుక జావళిగా నరుదెంచె మాలతో!

పద్యం : మేరువు వంటి రాముగని, మెల్లగ జేరెను సీత చెంతకున్
చోరునివోలె; విస్మయము సంభ్రమముల్ పెనవేసి, దేహమున్
తీరని వింత ఖేదనతో సిగ్గుల మొగ్గయి పూలమాలతో
శ్రీ రఘురామ భూవరుని శ్రీకర కంఠమునందు వేయగా!

ఘజల్ : హరితో సిరి కలసిపోగా
విరులే పులకించి రాగా ॥హరితో॥

ధరణీతలమెల్ల వరపుత్రుడిని పొగడ
పులకింతలతో జాతి - గిలిగింతలవగా ॥హరితో॥

పద్యం : హంస వోలెను జానకి యడుగు లిడగా
కోయిలా నీదె యాలస్య మనుచు ప్రకృతి,
తాను పులకించె మేను విహ్వలముగాగ
ప్రేమగీతాలు కుహుకుహూ యనగ నౌర;

వచనం : సీతారాముల కళ్యాణము జగత్కళ్యాణము, అయోధ్యా నగరమునుండి దశరథమహారాజు సతీసుత సమేతంబుగా మిథిలా నగరమునకు చేరుకొని, శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు కమనీయంబుగా వివాహంబు లొనరించెను. శ్రీరాముడు సీతను, లక్ష్మణుడు ఊర్మిళను, భరతుడు మాండవిని, శత్రుఘ్నుడు శ్రుతకీర్తిని వివాహంబు చేసుకొనిరి.

ఘజల్ : శ్రీరామ కళ్యాణమే శ్రీ
రఘురామ రకళ్యాణమే ॥శ్రీరామ॥

జానకి సిగ్గుల మొగ్గయి నిలువగా
రాముడు వెన్నెల నవ్వులుకురియగ ॥శ్రీరామ॥

రాయంచలా సీత పడువ
లాలించగా రాము డచట
జగతికి శోభలు కూర్చిన జంట
ప్రగతికి దారులు వేసినదంట. ॥శ్రీరామ॥

పద్యం : చెలగి కళ్యాణ గుణధాము డచటనుండి,
కదలి వచ్చెను బంధువర్గమ్ము తోడ
నా అయోధ్యకు, జానకి కలసి నడువ
జనుల ఆనందమాలల నందుకొనగ!

తనదు సంతోషమును తెల్పుకొనెడు వేళ
దశరథుడు; ఆ అయోధ్యాధిపు డచటి జనుల
మంత్రులను జూచి యిట్లనె మాన్యులార!
రాము డీ భువి నేలగా రక్తి కలుగు
అతడికే రాజ్య పట్టాభిషేకములను
చేయ తలపెట్టినాడను మీర లెల్ల
రామ పరిపాలనను గనుడు రక్తి దీర!

ఘజల్ : శ్రీరాముని పట్టాభిషేకమట
సీతారాముల రాజ్యపాలనట
జగతికి ప్రగతికి రాజమార్గమట
రారండీ మనకందర కిదియే
సంతోషము కలిగించు వార్తయని
జనులు సంతసముతోడ పాటలే
పాడగ పలికెను అయోధ్య వీదులు ॥శ్రీరాముని॥

పద్యం : ఇట్టి శుభవార్త మంధర చెవుల సోకి
నోటి నుండది దుర్వార్త వోలె వెడలె ....
ఆమె కైకను చేరెను కసిగ నడచి,
ఘోరమే! ఇది కైక నీకుగాక
రాజమాతను గౌరవ మింక వేరు
సతులు గొనుటను నేనెట్లు చూడగలను?

చెలగి నలుదిక్కులన్ పిడుగు పడిన యటుల
తోచె నా మది రాముని రాజ్య వార్త
లెమ్మ ఇక నీదు వరముల కోరుకొనుము!
యనుచు కైకమ్మ మనసున కసిని పెంచె!

పద్యం : కైక దశరథరాజును కోరెనంత
తనదు వరములు శ్రీరాము డడవి జనుట
భరతునకు రాజ్య పట్టాభిషేక మగుట
కట కటా! కాల మీ విధి కాటు వేసె!

పద్యం : క్షణము చంద్రుని వెల్గులు క్షీణ మవగ
కటిక చీకటి యచ్చట కమ్ముకొనెను.
అంధకారములో అయోధ్య ప్రజలు వడిరి.
సీత శ్రీరామ లక్ష్మణు లడవి జనిరి!

పద్యం : కాషాయ వస్త్రమ్ము కట్టి శ్రీరాముడు
కదలిపోయెను ఆ అయోధ్య ప్రజల వీడి
తన వెంట జానకి, ఆవెంట లక్ష్మణుం
డరయ తోడుగ వెంట నడచుచుండ
తల్లి కౌసల్య కన్నుల నీరుగార
కుమిలి ఏడ్చుచునుండెను క్రూరమైన
రాజకీయమ్ములో బలియైన రాముని
తలచి ప్రజలెల్ల దుఃఖసాగరమున మునుగ

చెట్లు పుట్టలు చేలు కన్నీరు గార్చ
రామనామమ్ము దలచుచు దుఃఖపడగ
ప్రజలు గుంపులు గుంపులై యతనితోడ
నడచి వచ్చిరి వనవాసదీక్ష జేయ!

పద్యం : మెదడు నరములు చిట్లిపోవగను రాజు
కూలబడియెను శ్రీరామనామ మొకటె
మిగిలియున్నది చైతన్యము లెగిరిపోయె
రామ శ్రీరామ యనుచు తా కలవరించె.

పద్యం : రాఘవా నీకు నేనెంత ద్రోహి నైతి
మాట కొరకని కానన కంపినాను
యిట్టి పాపము నాకెన్ని జన్మలైన
తొలగునాయంచు దశరథుడెంతొ యేడ్చె!

ఘజల్ : ఆవిధి దశరథు దవనత మవగా ఆనందముతో కైక
భరతుని రాజ్యము కొరకై బహువిధ కార్యక్రమములు సలిపె
అది విని భరతుడు ఆగ్రహ వీక్షణ చక్షువుడై యరుదెంచి
తల్లిని యాగ్రహమెల్ల తీరగా తరచి తరచి నిందించె.

పద్యం : రాక్షసీ నాకు కావలె రాజ్యమనుచు
నీకు చెప్పితినా నేను ఎన్నడైన?
ఏల ఈ పాపమున కొడిగట్టినావు
దుఃఖసాగరమందు నేనుండజాల!

ఘజల్ : 1. ఈ విధి భరతుడు తల్లిని నిందించె!
తన పాపమునకు తానే దుఃఖించె!
అపుడే దశరథు డస్తమించెను!
అయోధ్య దుఃఖములోన మునిగెను!

2. దుఃఖభారమున శ్రాద్ధకర్మలను
భరత శత్రుఘ్ను లాచరించిరి
కర్మకాండలను పూర్తి చేసుకుని
రాముని చేరుట కుద్యమించిరి!
తమ తోడుత మంత్రులు ప్రజలు
నడువగ రాముని కొరకయి వెడలిరి!

పద్యం : అగ్రజా! నన్ను క్షమియింపు మనుచు నిన్ను
కోర లేనయ్య నాపాప మిట్టులుండె.
జరిగిపోయిన దానికి నాదు స్ఫూర్తి
ఎంతమాత్రము లేదు నీతోడు రామా!

ఘజల్: 1. పడిపడి భరతుడు రాముని పాదము
లంటి దుఃఖమున గద్గదస్వరముతో
నీ రాజ్యము నీకే ఇచ్చితి
చేకొని ఏలుకొమ్మని పలికెను.
నీవు రాజ్యమును చేకొనకుండిన
ఆత్మాహుతితో మ్రందెద ననెను!

2. అనుజుని దుఃఖము గాంచి రాఘవుడు
ఆదరముగ అనునయము చేసెను.
దోషము నీదని పలుకుచుంటినా
దుఃఖము వీడుము నీవని పలికెను.

పద్యం : కర్మ ఫలమిది సోదరా ఏరికైన
ధరను తప్పదు యనుభవ మొందకున్న
నీవు పినతల్లి నిమిత్త మాత్రులయ్యా!
జరుగవలసిన ప్రారబ్ధ మిట్లు జరిగె!

ఘజల్ : అనుచు రాఘవుడు వడివడి తండ్రికి
శ్రాద్ధ కర్మలను పూర్తిచేసెను.
నదీ జలమ్ముల లోన నిలబడి
తండ్రికి తర్పణ లన్ని యొసగెను!

పద్యం : తండ్రి మాటను నిల్పుట నాకెకాదు
నీకు నైతము బాధ్యతయౌను భరత!
కనుక ఇక నీవు అయోధ్య నగర మేగి
ప్రజల పాలించి ఘనకీర్తి నందుకొనుము!

ఘజల్ : అనుచు రాఘవుడు పలికిన పలుకులు
భరతుని పాలిట నిలిచె ములుకులై!
అన్నా! ఇది అన్యాయము నాకింతటి
శిక్షను వేయుట తగదని దుఃఖము చెందెను!
కాదని రాముడు కరకున పలుకగ

పాదరక్షలను అనుగ్రహింపుము
వాటికె రాజ్యము పట్టము గట్టెద
ననుచు భరతుడా పాదుకలను గొని
తలపై నిడుకొని నడిచి వచ్చెను.
అట్టి పాదుకలు సింహాసనమున
ఉంచి పట్టాభిషేక మొనరించె
రాముని తరపున రాజప్రతినిధిగ
అయోధ్య నగరికి పాలకు డాయెను!
అన్నదమ్ముల ప్రేమ బాంధవ్య
ములకు భరతుడే ప్రతినిధి అయ్యెను.





వసంతరాయ్

# 3

వచనం : అంత శ్రీరామచంద్రుడు భరత శత్రుఘ్నులను అయోధ్యకు పంపించి, తాను సీతాలక్ష్మణ సమేతుడై అరణ్య మార్గమున ముందుకు నడిచెను. సరయూ నదీ ప్రవాహమును దాటించుటకు గుహుడు తన పడవలో శ్రీరాముని, సీతను, లక్ష్మణుని అత్యంత భక్తి శ్రద్ధలతో దాటించి ధన్యుడాయెను. అరణ్య మార్గమున తన జపము జేయుచునున్న శబరిని గాంచి, భక్తితో ఆమె ఇచ్చిన పళ్ళను తిని శ్రీరాముడు శబరిని ధన్యురాలను జేసెను.

పద్యం : సాయమడుగని రాముడు గుహుని జూచి
నదిని దాటించ సాయము గోరె నపుడు
జన్మసాగర మందున జనుల బ్రోచు
రాము నాయెడ నది దాటవైచె గుహుడు!

పద్యం : చేయిసాచని రాముడు శబరి చెంత
చేయిసాచెను, ఎంగిలిపండ్ల కొరకు
అలసి నడుచుచు నున్న ఆ ఆత్మబంధు
నేద తీర్చెనుగాదె యా శబరి ప్రేమ!

పద్యం : అడవులందున తపముల నాచరించు
మునుల కన్నను ధన్యు డా గుహుడు గాదె!
వేద గ్రంథాలు జదివెడు వారికన్న
ధన్యమగుగాదె శబరి యా యాశ్రమమున!

ఘజల్ : నడచెను శ్రీరాముడు
ఆడవుల బడి అలసట యెరుగక
సీతాలక్ష్మణులు తోడుగా ॥నడచెను॥

తన పాదములతో
పుడమి పులకించ

వడి వడి నడకల
ధరణి తడబడగ ॥నడచెను॥

పద్యం : హంస తూలికలపై యలరారినట్టి యా
ధరణిపతి ముళ్ళబాటలను నడచె
రాజమహలులోన రాజిల్లినట్టి యా
పుడమి పతి పూరిగుడిసె జేరె!
అందాల భవనాల హాయిగా నడచిన
రాజేంద్రు డాశ్రమంబునను నిలిచె.
కాలుగదలిన సైనికులున్న రాజు
కడకు ఒంటరి జీవిగా కలత చెందె!

ఔర! విధి లీల నెవ్వడు ఆపగలడు?
కర్మ ఫలమిది యందువా? కాదుకాదు!
మనుజులందున ఈర్ష్య యసూయలన్న
నిజము నిజమని చెప్పగా నీతి గలదు!

ఘజల్ : ఆశ్రమమే అందచందాల భవనము
అందున్న వారికి అదె రాజభవనము.
సంతోషమే వారి సౌభాగ్య ధనము
సంతృప్తి వారికి సంతోష పవనము ॥ఆశ్రమమే॥

శ్రీరాముడే రాజు సీతమ్మ రాణి
లక్ష్మణుడు వారికి సౌభాగ్యదాయి!
ఆచోటె వారికి సామ్రాజ్యభూమి
దినదినము ఆనందమే పొందు స్వామి. ॥ఆశ్రమమే॥

పద్యం : అందచందాల హరిణుల జూచి సీత
మనసు యానంద పరవశ మందుకొనును.
పావురము లాశ్రమంబున పరచుకొనును
రామ చిలుకలు రామ రామమ్మ పలుకు!



వసంతం

పద్యం : ఉదయమే లేచి లక్ష్మణు డడవి కేగి
పూలు ఫలములు తెచ్చును; పూజచేసి
జానకీదేవి వాటి నాహార మిడును
ముదము దీరగ క్షుద్బాధ తీరిపోవ!

పద్యం : ప్రకృతి యందాలు పరికించు చుండ్రు వారు
నదిని ప్రవహించు నీటిని త్రావుచుండ్రు
పూల వనముల విశ్రాంతి చెందుచుండ్రు
చెలగి హరిణుల చెండాడి చంపుచుండ్రు

ఘజల్ ; ఈ విధి రాముడు
సీతాలక్ష్మణ సహితుడుగా!
ఆశ్రమంబులో కాలము గడుపుచు
ఆనందముగా ధరనుండ!
ఆకసమ్ములో పోవుచునుండిన
కామరూపిణి శూర్పణఖ
కనులతో గాంచెను కామము పొంగగ
ఔరా! మానస చోరుడు వీడని
రయమున దిగె నా రాక్షస మహిళ!

పద్యం : ఏమి మానవుని అందచంద మనుచు
కనులు విప్పార పరికించి కాంచె నామె!
దివ్య జ్యోతులు వెలుగగా ధరణిపైన
పూల బాణపు యువకుడీ పుణ్యమూర్తి!

ఘజల్: 1. అనుచు రాక్షసాంగన మదిలోతులలో మైకము గ్రమ్మగ నిలిచే
ప్రేమ పిపాసలము కాగ మానసము రాముని సన్నిధి కేతెంచే!
కామరూపమున సుందరాంగిణిగ, మెరుపుల తీగగ జనియించి.
ఓయి మానవా నన్ను చేకొనుము నీకు స్వర్గమే చూపించెదనని
పరిపరివిధముల రామునిపై బడ ప్రయత్నించె నా సుందరరూపిణి!

ఘజల్: 2. అది గాంచి శ్రీరాముడాశ్చర్యమున లేచి
సిగ్గుతో తడబడుచు చిరునవ్వు నవ్వి

ఓసి రాక్షస యువతి ఈ జన్మలోన
నిను నేను కూడగా సాధ్యమ్ముకాదు
ఏకపత్నీవ్రతుడ నేనెవ్వరినిగాని
కన్నెత్తి చూడ నో కామరూపిణి వినుము.
దయచేసి నను వీడి పొమ్ము దానవమహిళ
యనుచు శ్రీరాముడా మహిళ మనసును విరిచె!

ఘజల్: 3. ఛీ! వీడు పనికిరాడని నిర్ణయించుకొని
ప్రక్కనే నిలబడిన లక్ష్మణుని గాంచి!
ఆహా! వీడింతకంటెను అందముగ గలడు
ఇతని ప్రేమించినను చాలు నీ జన్మ
అనుచు లక్ష్మణు జేరి ఇట్లనుచు పలికె!

ఘజల్: 4. తాళలేనురా; ప్రేమికా! నే నీ
వేళ నిను వీడి తాళలేనురా ప్రేమికా ॥తాళలేనురా॥

పైట బరువై పోయె
పరువమే విప్పారె
ప్రేమతో నా వయసు
పేట్రేగి పోయెరా ॥తాళలేనురా॥

కనులు కళవళ మందె
అధరాలు అదిరెను
బుగ్గలో సిగ్గుతో
ఎరుపెక్కెనవిరా ॥తాళలేనురా॥

పద్యం : అనుచు రాక్షస మహిళ పైబడుచు రాగ
నాగ్రహమ్మున లక్ష్మణు డామె బట్టి
కరకు కరవాలమున ముక్కుచెవులు కోసి
రాక్షసీ పొమ్ము! యిదె నీకు శాస్తి యనెను!

పద్యం : గర్వభంగము గాగ నా రాక్షసాంగి
దుఃఖ ముప్పొంగ రావణా! యనుచు నేడ్చి
క్షణము ఆగ్రహ జ్వాలలతోడ జూచి
బదులు తీర్చెద ననుచు నదృశ్యమాయె!

# 4

పద్యం : రావణుండన్న జగములే భీతి చెందు!
అష్ట దిక్పాలకులు భయభ్రాంతి నుంద్రు
సురలు నరులును వానర గణములెల్ల
భయము జెందుదు రాతని పేరు విన్న!

పద్యం : శివుని భక్తుడు, వేదాంతవేద్యు డతడు
సకల శాస్త్రము లన్ని వేదములు జదివి
జగతి లోపల పండితు డన్న పేరు
యుద్ధ భీకరు డనుచును ఖ్యాతి చెందె!

ఘజల్ : భళిరా ఓ రావణా! భీకర చరిత్ర
కలవో నీ భావనా!
అష్ట దిక్పాలకుల నణచిన వీరా!
పరమశివునే కొల్చి గెలిచిన ధీరా! ॥భళిరా॥

పద్యం : అతడు కొలువైన ఆవేళ అప్సరసలు
నాట్యమాడుచు నుండగా శూర్పణఖయు
రావణా రక్ష! రాక్షసరాజ! యనుచు
పాదముల చెంత ప్రత్యక్షమౌచు నేడ్చె!

ఘజల్: 1. భగ్గు మనె నా లంకసింహము
అగ్గి గుగ్గిల మందు కొన్నటు
ప్రళయ భీకర సంద్ర ఘోషలు
విలయ తాండవ మాడినట్లు ॥భగ్గు॥
ఎవడు వాడు? ఎచటివాడు?
నిన్ను ఈవిధి చేసినాడు?
చెప్పుమా యిక ఓర్వలేనని
ఆగ్రహమ్మున హుంకరించెను!

అదిరిపడె నా సభాభవనము
అష్టదిక్కులు త్రుళ్ళిపడెను
ప్రళయకాలము ముందు
దుర్ఘటనాంబుధులు కదలెన్!                    ॥భగ్గు॥

2. అన్నా! అతడొక నరుడు! పామరుడు
కన్నావా అతగాడి చర్యలు!
నిన్నే ఎవడని పలికిన నీచుడు
అన్నన్నా అహంభావ పూరితుడు                    ॥అన్నా॥

అడవులలోన గతి లేకున్నను
ఇడుములలో బడి తడబడుచున్నను!
రావణు డనినచో ఎవడని పలికెను
నీవన ఎన్నో నిందలు పలికెను.                    ॥అన్నా॥

పద్యం : నిన్ను నిందించ నాగ్రహమంది నేను
మందలించగ ఈ విధి ముక్కుచెవులు
కోసి; మరి నిన్ను తిట్టిపోసెను గదయ్య!
నీవు; యతని మద మొంచవలయు ముందు.

పద్యం : అతడి యర్ధాంగి యద్భుత సుందరాంగి
భువనములలోన లేదురా యందగత్తె
ఆమె; నీవంటి వీరుని యాలి యైన
సకల లోకములన్ గెలుపొందినట్లు!

ఘజల్ : ఈ విధి రాక్షసయువతి బలుకగా
యాగ్రహమ్ముతో రావణుడు
కండకావరము కన్నులు గప్పగ
మెండుగ పల్కె ప్రగల్భములు
ఇపుడే తెచ్చెద రాముని భార్యను
అప్పుడు తెలియును నాడు క్రోధము!

రావణు డన్నచో ముల్లోకములే
గడగడ వణకును వీడికి తెలియదు
చూడుము నాదు ప్రతాపములనుచును
వడివడి నడచెను సభనుండి!

పద్యం : అపుడు ఆకసమందు దుశ్శకున మాయె!
పుడమిపై గ్రద్దలరచుచు తిరుగులాడె!
ధూమకేతువు కనిపించె ప్రజలకెల్ల
ఏమి ఉపద్రవమో యని ప్రజలు పలుక!

పద్యం : ముందుగా మాయ రూపున రావణుండు
పర్ణశాలను చేరి పరీక్షతోడ
రామ. లక్ష్మణ, జానకి రాజసముల
గాంచి మనమున భళిభళి యనుచు మెచ్చె!

పద్యం : ఆమె అందాలరాశి యప్సరసలకన్న
మేలి బంగారు రంగారు రూపు గాదె
భళిర ఈమెను చేరని బ్రతుకదేల?
యనుచు మనసున తలపోసె రావణుండు!

ఘజల్: 1. అపుడు రావణుడు కామమోహితుడు
కన్నులు కనపడనట్టి అంధుడు
సకల శాస్త్రములు, వేదధర్మములు
మరచిన మూర్ఖపు రాక్షసేశుడు ॥అపుడు॥

క్షణమున సీతను తోడ్కొని పోవగ
రాక్షస మాయను ఉయోగించగ
మాయలేడిగా మారి సీత నట
ఆకర్షించగ మారీచుని గని
ఆజ్ఞాపించెను తక్షణమే. ॥అపుడు॥

2. కదలెను బంగారులేడి
పర్ణశాల సామీప్యమందున ॥కదలెను॥

అందమంత తన వంటి రంగులో
అద్భుత ఆకర్షణను మోములో
కలిగిన లేడి చెంగు చెంగుమని
ఎగురుచు దుముకుచు నడచెను అచ్చట ॥కదలెను॥

అది కన్నులబడి జానకి మురిసెను
ఆహా! అద్భుతమనుకొని నవ్వెను
హంసతూలికా తల్పము కోరని
మైథిలి రాముని చెంతన చేరి
లేడిని తెమ్మని ముదమున కోరెను ॥కదలెను॥

పద్యం : సీత కోరిక మన్నించి రామచంద్రు
డందు కొనియెను విల్లమ్ము లంత తాను
నేనె వెళ్ళెదనని లక్ష్మణుండు పలుక
నతని వారించి హరిణిని పట్ట వెడలె!

ఘజల్ : అడుగు అడుగునకు ఆమడ దూరము
లందుకొనునట్లు లేడి ఉరికెను
ఆశ్చర్యముతో రాముడు తడబడి
ఆలోచించెను పరిణామమ్మును ॥అడుగు॥

పద్యం : ఏమిటీ విధి హరిణ మీ వింతపరుగు
యనుచు క్షణకాల మాతడు చింతజేసి
ముందు కొచ్చితి, వెనుకడుగేయజాల!
మాయనైనను ఛేదించు టొకటె దారి!

ఘజల్ : అనుచు రాముడాగ్రహము చెందుచు
వడి వడి యడుగులు వేసెను లేడిని
సంహరించగా అడుగొక ఆమడ దూరముగా ॥అనుచు॥

రాక్షస మాయతో రాముని కందక
పరుగిడు చుండెను లేడి యడవిలో
విసుగు కోప ముప్పొంగ శ్రీరాము
డంతట వేసెను బాణ మొక్కటి! ॥అనుచు॥

ఘజల్ : హా సీతా! లక్ష్మణా!
హా సీతా! లక్ష్మణా!
యనుచు శ్రీరాము డరచినట్లుగా
అరచుచు నేలను బడి మరణించెను
మాయ లేడి తన విధి ముగించెను
అంతట రాముడు లేడి పలుకులను
ఆశ్చర్యముతో గమనించి!
ఏమి చిత్రమని యనుకొనుచుండగ
ఆశ్రమ వాటిక యిట్లుండె!

పద్యం : లక్ష్మణా! చూడు మటనుండి యన్నగారు
పిలుచుచున్నారు సాయము కోరి నిన్ను
వేగమే వెళ్ళి యాతని యండ జేరి
గెలుచుకొని రండు యటనున్న శత్రువులను!

ఘజల్ : అమ్మా! అది రాక్షస మాయ; కా
దమ్మా! రాముని ఆర్తనాదము! ॥అమ్మా॥
కళవళ పడకుము రాముడీ పగిది
పలికెడు సామాన్యుడు కాడు!
అతడే వచ్చును తిరిగి విజయుడై
నిను కాపాడుటె నాదు ధర్మము ॥అమ్మ॥

పద్యం ; ఆగ్రహమ్మొందె జానకి యంతలోన
ఔర! విధిలీల నెవ్వార లాపగలరు?
లక్ష్మణా నాకు ననుమాన మాయె నీదు
దుష్ప్రవర్తన పైన నింకేమి సేతు?

ఘజల్ : అనుచు జానకీ యనుమానించగ
హరి హరి ఈ విధి ఏమిటా యని?
భయము నాగ్రహము మదిని నిండగా
భారమైన మనసున లక్ష్మణుడు.

పద్యం : ఇవియె లక్ష్మణరేఖలు యంతకన్న
ఏమి కాపాడగలను ఓయమ్మ నిన్ను
అనుచు కరవాలమున రెండు రేఖ లుంచి
దీని దాటకు మమ్మ నా మాట వినుము!

పద్యం : ఇది భయంకర రాక్షస నిలయమైన
దుర్గ మారణ్య ప్రాంతము యెవరుగాని
వచ్చినన్ దీని దాటిపోరాదు నీవు
అనుచు లక్ష్మణు డటనుండి వెడలిపోయె!

పద్యం : హరహరా! సాంబశంకరా! యనుచు వచ్చె
కపట సన్యాసి రూపున రావణుండు
భవతి! భిక్షాం దేహి నంచును నిలిచె నతడు
లక్ష్మణుని రేఖ దాటక లాస్యముగను!

పద్యం : పాప పుణ్యమ్ము లరయని పారిజాత
సీత! తనవెంట భిక్ష గైకొనుచు వచ్చె!
రేఖ కావల సన్యాసి యివల నీమె
భిక్ష వేయుట కష్టమై పోయె నపుడు!

పద్యం : మగువ! నీకిది కండ కావరము గాదె!
హరి హరాదుల గెల్చిన మమ్ము జూచి
భిక్ష వేయుట కొరకింత బాధయగున?
వెడలి పోయెద రిక్తహస్తముల తోడ!

ఘజల్ : అనుచు రావణుడు బెదరగొట్టగా
గృహిణి ధర్మమున జానకి యప్పుడు
కలత చెందినను కనపడనీయక
లక్ష్మణ రేఖను దాటివచ్చెను
భిక్ష వేయగా నతని జేరెను॥

పద్యం : అంత రావణు డామెకు తనదు రూపు
జూప; భయమున జానకి మూర్ఛ నొందె!
తనదు ఆకాశ వాహనమందు నామె
నుంచి, లంకకు గొనిపోవ నుద్యమించె!

ఘజల్: 1. ఆకసమ్ములో బంధనమై తను పోవుచుండగా మేలుకొని
వెక్కి వెక్కి ఏడ్చినది జానకి విడువు మనుచు బెదిరించినది
తనను వీడుమని ప్రార్థించినది తలను చేతులతో కొట్టుకున్నది
కావరావ శ్రీరామ యంచును కదలివోలె ఘోషించినది
ఆర్తనాదముల ఆకాశంబే ప్రతిధ్వనించగ రోదించినది

2. ఆమె రోదనము విన్న జటాయువు కావగ వచ్చెను తటాలున
ఓరి రావణా విడువు జానకిని యనుచు పక్షివరు డడ్డగించెను
భయము లేక రావణుడు కత్తితో నరుక యత్నించె పక్షిరాజును:

పద్యం : అపుడు భీకర యుద్ధము యాకసమున
జరిగె రావణునకు జటాయువునకును
చెలగె యాతని శక్తి క్షీణించి పోవ
రావణుడంత పక్షి రెక్కలను నరికె!

పద్యం : తనను రక్షింప నిక యెవరి తరముగాదు
యనుచు తలపోసి జానకి తనదు నగలు
మూట గట్టియు క్రిందకు జారవిడిచి
రామ! శ్రీరామ! ననుగావు మనుచు ఏడ్చె!

పద్యం : క్రింద పడినట్టి నగలు కిష్కింధలోన
యడవులందున తిరుగాడు వానరులకు
దొరికె నవియొక సాక్ష్యమై మిగిలిపోయె!
యంత జానకి రావణు లంక చేరె!

పద్యం : తనదు రెక్కలు పోవ జటాయువుండు
కూలబడియెను పుడమిపై కొండవోలె
రామనామము దల్చుచు ప్రాణములను
నిలుపుకొనెనట్టి మాట రామునకు తెలుప!

# 5

వచనం : ఇదిలా ఉండగా, అరణ్య మధ్యమ్మున లక్ష్మణుడు శ్రీరాముని కలసి, జరిగిన సంగతి వివరించెను. ఇది రాక్షసమాయ యని ఊహించి, ఆందోళనతో ఇరువురు ఆశ్రమంబు చేరుకొనిరి, కాని అప్పటికే సీత అపహరించబడినదికదా! దానితో శ్రీరాముడు దుఃఖ సముద్రమున మునిగి యిట్లు విలపించెను.

ఘజల్ : ఏడడుగులు నడిచిన నాతో
కారడవులకే నడిపించితినే!
జానకి! నేనొక మూర్ఖుడ నైతిని
పతిగా నీకా సుఖ మిచ్చితిని ॥ఏడడు॥

కష్టసుఖములు, సతిపతులకు, చెరి
సగమని నమ్మి నాతో నడచిన
సతి; నీకేమున్నది? కానల, కోనల
నడచుట, కష్టము లనుభవించుట! ॥ఏడడు॥

ఏమని చెప్పుదు మిథిలకు నేడు
అయోధ్యలోనైనను ఏమందును?
ఎటనుంటివని? ఏమైతివని?
ఏచోటని నే వెదుకబోదును ॥ఏడడు॥

పద్యం : అనుచు ఈ విధి శ్రీరాము డేడ్చుచుండ
ధైర్య మిచ్చుచు లక్ష్మణు డతనితోడ
వెడలె జానకి జాడలు వెదుకుటకును
అడవులే వారి కప్పుడు ఆస్తులాయె!

పద్యం : కరకు రాళ్ళట కత్తులై కాళ్ళు చీల్చ
లక్ష్మణా! యంచు సోదరు నాశ్రయించు!
పాత స్మృతులాశ్రయించిన దుఃఖపడుచు
జానకీ యంచు రాముడు కుమిలిపోవు!

ఘజల్: 1. నడిచెను శ్రీరాముడు

అడవులబడి కడు యిడుములతో ॥నడచెను॥

లక్ష్మణు డొకడే రక్షకుడై జగ
ద్రక్షకుడే కడు దయనీయముగా ॥నడచెను॥

దుఃఖముతో కడుదుఃఖముతో
ఒక్కొకసారి మూర్ఛిలి లేచుచు ॥నడచెను॥

కొండలు, కోనలు, నదులే వెదికెను
చెట్టూ, పుట్టా, తెట్టెల నడిగెను. ॥నడచెను॥

ఘజల్: 2. మైథిలీ నీదు జ్ఞాపకం-కలచివేసెను నాదు జీవితం
ఏచోట నేను ఉన్నా - ఏ రూపమే చూసినా
నీ రూపమే నాదు మనసెల్ల నిండెను -
నీ జ్ఞాపకం నాదు బ్రతుకంత కలచేను ॥మైథిలీ॥

అందాల లోకాలు - గాఢాంధకారాలు
అనురాగమే లేని అరణ్య మార్గాలు
కారుణ్యమే లేని కఠినాతి కఠినాలు ॥మైథిలీ॥

ఏమైతివో నీవు - ఏకాకివై
ఏ బాధలో ఉంటివో బేలవై
ఏ తీరు రక్షింతు నిన్నింక నేను
కన్నీరు వర్షింతు నింకేమి సేతు ॥మైథిలీ॥

నీ నవ్వులే నాదు చెవులందు ధ్వనియించె
నీ చూపులే నాదు కనులందు కనిపించె
నీ పిలుపులే నాకు జగమెల్ల వినిపించె
నీ కాలియందెల సవ్వడులు తలపించె ॥మైథిలీ॥

కోపమ్ము దుఃఖమ్ము నను క్రమ్ముకొనియె
కన్నీరు నాలోన ఉప్పొంగి పొరలె

యిక ఓపలేనింక ఈ వేదన
పగవాడికే వద్దు ఈ శోధన. ॥మైథిలీ॥

పద్యం : మార్గమధ్యమ్మునం జటాయువుడు కలిసె
సీత నిటువైపు రావణు డెత్తుకెళ్ళె
యనుచు రాముని కెరిగించి కన్నుమూసె
కటకటా ఎన్ని కష్టాలు కావనమున?

ఘజల్: 1. జటాయువుని అంత్యక్రియలు కావించి
అడవులంబడిరి రామలక్ష్మణులు
నడిచి నడిచి పలుదినముల కిద్దరు
చేరుకునిరి కిష్కింధ పర్వతము

2. మహాబలాఢ్యుడు వాలి రాజ్య మది
వాలి దెబ్బలకు తూలి సుగ్రీవు
డడవులంబడెను హనుమ తోడుగా
హనుమంతుడు సుగ్రీవు లచ్చట
కాలము గడుపుచు నుండ భయముగా!

3. కలసెను శ్రీరాముడు
లక్ష్మణ సమేతుడై ॥కలసెను॥

ఒకరి బాధ లింకొకరికి చెప్పగ
ఒకరి గాథ లింకొకరు ఒప్పగ ॥కలసెను॥

పద్యం : కొలది దినముల క్రితము మేమిక్కడుండ
ఆకసమ్మున నుండి యీ నగలమూట
క్రింద బడియెను యిది తెచ్చి దాచినాము
యనుచు హనుమంతు డామూట తెచ్చి చూపె!
నగలు గుర్తించి రామలక్ష్మణులు
జానకివే యని తెలుసుకొనిరంత
దుఃఖ పారవశ్యముతో రాముని
కన్నుల నీరు నిండెను క్షణము

మనసులోన పెనుతుఫాను నిండగ
క్షణము శ్రీరాముడంత దుఃఖించె
లక్ష్మణు డాతని యనునయించెను.

పద్యం : దుఃఖమును వీడి యీ దురదృష్ట ఘటన
మరచిపోవయ్య యింక నా మాట వినుము!
లక్షలాదిగ వానర సైన్య మొదవ
నీకు నేనుండు నండగా! నీరజాక్ష!
జానకీదేవి జాడలు తెలిసినంత!
క్షణము లోపల విడిపించగలము మనము!

పద్యం : నీదు సేవకు నాదు సైన్యమ్ము నెల్ల
నిలిపి పోరెద నంచును యగ్నిసాక్షి!
తనదు యభయము నిచ్చె సుగ్రీవు డంత
సంతసంబున రాముడు స్వాంతపడగ!

పద్యం : రామ! శ్రీరామ! నాదొక్క మనవి వినుము!
నాదు రాజ్యము వాలి హస్తంబునందు!
చిక్కుపడినది; వానిని చంపి నాకు
రాజ్యప్రాప్తము గావించి! రక్షసేయు!

పద్యం : నీదు సతి భూమిపై యెక్కడున్న నేమి
వెతికి పెట్టగ నాదు సైన్యమ్ము నెల్ల
నడిపి, ముల్లోకములనెల్ల వెదకి వెదకి
తెచ్చిపెట్టుదు నీదు పాదముల సాక్షి!

ఘజల్: 1. యనుచు సుగ్రీవు డభయ మివ్వగా
యానందముతో రామలక్ష్మణులు!
యాలోచించిరి న్యాయాన్యాయము
లెవరి పక్షమొ! యనుచు రాత్రి!

2. గతము యెట్లున్న వర్తమానమున
వాలి నేరస్థు డనుచు నిందించి

వాలిని చంపగ మనసున రాముడు
నిర్ణయమ్ము చేకొనెను నిశ్చలుడు:

పద్యం : భయము విడుమోయి! సుగ్రీవ! బాధలేల!
చెలగి సూర్యోదయమ్మున వాలి తోడ
రణము సేయుము నీకండ నేను యుండి
యతని పరిమార్చి నీకు న్యాయమ్ము సేతు!

ఘజల్: 1. యనుచు రాము డభయమ్ము నివ్వగా
సుగ్రీవుడు తన బలము పెంచుకొని
రారా! రణమున కనుచు వాలిపై
తొడలు చరచి నిలిచెన్!

2. రణమున రాముని తలచి సుగ్రీవు
డరయగ వాలిని ముష్టిఘాతముల
పలువిధముల పడగొట్ట చూచెను
ఫలితము నిష్ఫలమాయె నిక్కము!

పద్యం: 1. వాలి దెబ్బల కంతట వళ్ళువాచి
తూలిపడుచును సుగ్రీవు డంత యడవు
లందు పడి పారివచ్చెను లజ్జతోడ
రామ! నినునమ్మి యీవిధినైతి ననెను!

2. మిత్రమా! యిది నాదు దోషమ్ము కాదు!
యనుజు లిద్దరు ఒకరూపె యౌట చూసి
ఎవరి చంపగ వలెనొ నాకర్థమవక
చూచుచుంటిసి నిస్సహాయుండ నైతి!

ఘజల్: 1. అనుచు మరునాడు పూలహారమును
సుగ్రీవుని మెడలోన వైచెను!
యిదే విజయహారమ్ము వెళ్ళుమని
రాముడు యభయమునిచ్చి పంపెను.



వసంతరాయ్

2. తిరిగి యుద్ధమే సేయ రమ్మనుచు
సుగ్రీవుడు రణభేరి మ్రోగించె
ఆగ్రహమ్ముతో వాలి క్రుద్ధుడై
యుద్ధము సేయగ వచ్చెనంతట!

3. అనుజు లిద్ద రతి ఘోరరూపున
రణము సేయంగ అలసె సుగ్రీవు
డంతట యాతని క్రింద పడగొట్టి
త్రొక్కిపట్టెనా వాలి పాదమున!
చెట్టు చాటుగా చేసి శ్రీరాము
డంత బాణమే వదలె వాలిపై

పద్యం : చెలగి మృగరాజు తనతల పైన బడగ
కూలి భువిపైన బడిన మత్తేభ మొదవ
భువిని కూలెను వాలి యన్యాయ మనుచు
అయిన నేమిటి యిది రాజకీయ మంతె!

ఘజల్ : విజయోత్సాహముతోడ సుగ్రీవు
డరయగ రాముని స్తుతియించె
రామలక్ష్మణులు తోడు నడవగా
కిష్కింధకు రాజాయె వెంటనే
సీతను వెదకుట కొరకు తక్షణము
నలుదిక్కుల వానరుల పంపెను.

పద్యం : దక్షిణాదికి హనుమంతు నెన్నుకొనెను
దక్షతనుగల్గి దిక్కులు దారులన్ని
వెదకి జానకి జాడను తెలుసుకొనెడు
భార మాతని మూపుపై బడెను గాదె!

ఘజల్: 1. దక్షిణమ్మ నంచున్నది సంద్రము
దాని దాటనిదె తెలియదు నిజము!
ధరను ముంచివేయంగ జాలినది
దాని జలశక్తి యత్యద్భుతము.

పద్యం : ఎటుల దాటగ వలయు నీ సముద్రమనుచు
వానరులు సుంత చింతించుచుండునంత
వాయుదేవుని తలచుచు హనుమ నిలచి
తనదు దేహము ఉప్పొంగ నెగిరె పైకి!

ఘజల్ : ఆనందోత్సాహమ్మున వానరులంత
హనుమంతునికి జై కొట్టిరి!
భళిర! వానరుల శక్తి చరిత్రను
నిలిపితి వంశము కీర్తించంగ!

పద్యం : అలలపై యాకసమ్మున అతడు తేలి
వాయువేగమ్ముతో పయనించుచుండె!
మార్గమధ్యమ్మునందొక రాక్షసాంగి
మదము నణచెను లంకను చేరుకొనెను!



## 6

పద్యం : చెలగి రావణు డంతట్ల చెరను వేయ
రాక్షసాంగన లెందరో కాపుగాయ
జానకీదేవి రాఘవు తలచుకొనుచు
మిగుల దుఃఖిలె నాయశోక వనములోన!

పద్యం : లక్ష్మణా! నిన్ను దూషించి పాపినైతి!
సోదరుని మించి నాకు శుశ్రూష చేసి
నావు! నిన్నెన్నో దూషణ చేసినాను
అట్టి పాపము ననుభవ మందుచుంటి

ఘజల్ : రాఘవా! కానవా నను కాపాడవా! ॥రాఘవా॥
నీకై తప మొనరించుచుంటిరా!
నిరతము నిన్నే తలచుచుంటిరా! ॥రాఘవా॥

నా మది క్షణక్షణ మోపలేక, ని
ర్జీవమాయెరా! నిజము తెలియరా! ॥రాఘవా॥

పాపము నాదె శాపము నాదె
లక్ష్మణ దూషణ ఫలితమిదే!
ఆందోళనలో అట్లుంటినిరా!
అది నీపై మమకారమె తెలియరా॥ ॥రాఘవా॥

పద్యం : మాయలేడిని తెమ్మని మాట జారి
లక్ష్మణుని దూషణముజేసి; మరది గీత
దాటి వచ్చిన ఫలితమీ నరకమౌర!
నన్ను రక్షించుమా యికనైన రామ!

ఘజల్ : రోజులు గడిచెను జాడలు తెలియక
ఆశలు వమ్మైపోయెను రామా ॥రోజులు॥

ఇన్నినాళ్ళుగా రావణు చెరలో
క్రుమ్మిపోతిరా రాక్షస పురిలో ॥రోజులు॥

ఇన్నాళ్ళుగ ఈ చెరలో ఉంటిని
ఇక నేనుండగ లేనో రామా ॥రోజులు॥

ఇంకేమున్నది ఆశారూపము
అంతములాయెను ఇన్ని దినములుగ
ఆత్మహత్యనే చేసుకొందును
అంతట నాకథ పూర్తి చెందును ॥రోజులు॥

7. ఏల ఈవేళ నాలోన రగిలేను చితివలె జ్ఞాపకం
రాఘవా! నేను నీకెంత బరువైతి నీక్షణం!
గాలి నను తాకి నీపైన రగిలించె బరువైన స్మృతులూ
ఏల రావేమి ఈ పాపికికనైన మృతులూ! * ॥ఏల॥

క్షణక్షణ మొక భీకర సంగ్రామమే నామహృదయం
లక్ష్మణా నిన్ను దూషించి పొందితి ఘోరనరకం
దుఃఖమా వీడిపోవా యింక నా జీవితాంతం ॥గాలి॥

మారె నానాడు ఆకాశగమనం
మారె నానాడు సూర్యుని ఆగమనం
ఏల నేనేల మారితి నానాడు ఆ క్షణము
కూలబడిపోవనా ఈ రాక్షసప్రాంగణమూ ॥గాలి॥

ప్రాణములు నీదు పాదాలపై ఉంచి బ్రతుకుచుంటినో
వాయువును నీదు పేరున పిల్చుకొనుచుంటినో
ప్రియతమా! నిన్ను తలవని క్షణములేదిది నిజము
రామరామా యన్నదే నాతపము నామొర వినుము!

---

* మృతులూ యనే పదం మృత్యువుకు బహువచనముగా వాడబడినది.

పద్యం : అతడు అకృత్యములు చేయలేక నన్ను
యిచట రాక్షసకాంతల నడుమ నుంచె
మానసిక చిత్రహింసలు పెట్టుచుండె
యింక భరియింప జాలనో రామచంద్ర!

పద్యం ; అనుచు దుఃఖిలుచుండిన యమ్మసీత
నచట యటనట వెదకుచు వచ్చి హనుమ
వినెను శ్రద్ధగ విహ్వలమాయె మనసు
అమ్మ నేనుంటి నినుగావ ననుచు వచ్చె!

ఘజల్ : ఆమె చుట్టూత నున్న రాక్ష
సాంగనలు నిద్రించ జూచి
అమ్మరో విన్ను కాపాడుటకై
వచ్చితినని దిగివచ్చె!
హనుమ వాలకము జూచి జానకి
నమ్మకమేమని యడిగె నాగా
శ్రీరాముడు తనకిడిన యుంగరము
జానకికిచ్చెను భక్తితోడుత!

పద్యం : అంత ఆనందమందె శ్రీకాంతునామె
చూడగల్గెను ఉంగరమందు తాను
రాఘవా! యంచు నొక పరి ఏడ్చిఏడ్చి
హనుమ తోడుత నిట్లనెనంత సీత!

పద్యం ; రాము డారాధ్యదైవ మీ ధరకు, నాకు,
నతడు క్షేమమా? లక్ష్మణు డెట్టులుండె?

నతని దూషించి నేనెంతో పాపినైతి
లక్ష్మణార్యునకు క్షమాపణలు తెలుపు!
అనుచు జానకి యాత్రము తోడుత
పలువిధ ప్రశ్నలు వేయుచుండగా
ఆమె దుఃఖములు పోవ హనుమంతు
డన్ని ప్రశ్నలకు బదులు చెప్పెను!

పద్యం : అమ్మరో! నిన్ను నా భుజబలముతోడ
విచట చేకొని కిష్కింధ చేర్చువాడ
వచట శ్రీరామ లక్ష్మణులున్నవారు
నిన్ను తలపోసి దుఃఖించుచున్నవారు

ఘజల్ : వారి దుఃఖము నీదు దుఃఖము
క్షణ కాలములో తీర్చగల్గుదును
నీదు యానతిమ్మ యని పల్కుచు
కరములు మోడ్చెను వాయుపుత్రుడుః
అతసి మాటలకు జానకి నవ్వుచు
అంత బలమున్నదా యని పల్కెను
రామనామ స్మరణమ్ముతోడ తన
కాయము పెంచెను ఆకసమంటగ
అది గని జానకి నమస్కరించెను
దివ్యరూపమును దించుకొమ్మనెను
క్రమక్రమమ్మ చిన్నకోతిగా
మారి నిలచె హనుమంతు డెదురుగాః

పద్యం : హనుమ! నీశక్తియుక్తులు అర్థమాయె
అంత బలశాలివే నీవు అయినగానీ
రాముడే వచ్చి రణమున గెలిచి నన్ను
వెంట గొనిపోవ న్యాయమౌనయ్యా తండ్రిః

ఘజల్ : అనుచు జానకి వాయుపుత్రునికి
తనదు ఆభరణ మిచ్చి దీవించె
క్షణము యాలస్యమైన జేయక
తరలి వెళ్ళి తన పలుకు తెలుపమనె॥
అంత హనుమంతు డటనుండి వెడలి వచ్చి
లంక లోపల వీథులు తిరిగి చూసె
రావణాసురు సభాభవనములను
సుంత పరికించ నచ్చట కేగినంతః

పద్యం : ఎవడురా నీవు ఎక్కడనుండి వచ్చి
నావు ఏదేశ మేది నీ నామ మేమి
తెలుపుమా ఎందుకని వచ్చినావు నీవు
అనుచు రావణు డంత ప్రశ్నించె నతని!

పద్యం : నేను హనుమంతుడను కిష్కింధ మాది!
వానరేశుడు సుగ్రీవు డతని బంటు
నేను శ్రీరాము డంపగా వచ్చినాను
జానకీదేని జాడను తెలుసుకొనగ!

ఘజల్ : అంత రావణుడు ఆగ్రహమ్ముతో
పటపట లాడగ పళ్ళు కొరికెను
మీరు వానరులా, వాడొక నరుడు
నేను రావణుడ రాక్షసేశుడను
నన్ను గెలువ మీ తరమా యనెను?

పద్యం : తనదు వాలము పెంచెను హనుమ యపుడు
ఆసనమ్మాయె నది సింహాసనము మించి
దానిపై నెక్కి కూర్చుండి నవ్వి పలికె
మేము చాలును రావణా నిన్ను గెలువ!

ఘజల్ : నరులు వానరులు నిన్ను చంపగా
నడచివచ్చు రోజొచ్చెనురా!
క్రూర కర్మలకు శిక్ష తప్పదిక
శివుని తలచుకో రావణా! ॥నరులు॥

నీదు మూలమున రాక్షస జాతికి
సర్వనాశనము తప్పదురా!
సీత నికనైన రాము దరిజేర్చి
తప్పు ఒప్పుకొన ముప్పు తొలగురా! ॥నరులు॥

ఘజల్: ?. హనుమ మాటలకు రావణుండంత
అగ్గి బుగ్గిగా ఎగిరె కొండంత

కట్టి బంధించి కొట్టి చంపుడని
అరచి భటుల కాజ్ఞాపించగ!

ఘజల్! వి. బిలబిలమంటూ రాక్షస సైన్యము
మూగెను హనుమంతుని బంధింపగ
అతడు వాయువేగమ్మున ఎగిరి
ఎదలు పగలగా తన్నెవారిని

పద్యం : సైనికుల నెందరినొ చంపి సాక్ష్యమునకు
నిలచి యున్నట్టి హనుమంతు నదిమివేయ
మేఘనాథుడు బ్రహ్మాస్త్ర మంత విడువ
చిక్కుబడియెను హనుమన్న చిత్రముగను

ఘజల్ : అతని చంపుడని రాక్షసేశు డాజ్ఞాపించెను తక్షణము
ఇది అన్యాయము దూతను చంపుట పాపమనెను విభీషణు
డాక్షణము
అది విని రావణు డాగ్రహమ్ముతో సుడివడు నవ్వులు నవ్వి
తోక కాల్చి పంపించుడని యానతిచ్చెను క్రోధము తగ్గి!

పద్యం : తనదు వాలము అగ్నికీలలను మోయ
లంక నెల్లను కాల్చుచు లక్షణముగ
ఎగిరి సంద్రము నందున తోకముంచి
తిరిగి తీరిక తోడ యేతెంచె నంత!

ఘజల్ : ఎక్కడ చూచిన అగ్నిజ్వాలలై
లంక తగులబడుచుండగ చూసి
ఒక్కడు వానరు డింత చేసెనని
రావణు డెంతో చింత చేసెను
అది విని యాతని సతి మండోదరి
పరుగున వచ్చి ప్రభువును చూసి
ఏల ఈ ఘోర రణరంగమునకు
ఎందుకు నడచుచు నుంటివి స్వామీ!

సీతను రాముని కప్పగించుము
చింతలు దూరము చేసి బ్రతుకుము

పద్యం : అనుచు ఆయమ చెప్పినదంత వినుచు
తరుణి! యిది నాకు తెలియును తాటకాది
రాక్షసుల జంపినట్టి శ్రీరాము డనుచు
అయిన యిప్పుడు ఓడుట భావ్యమగున?

ఘజల్ ; మంచికో చెడుకో రాముని తోడుత
యుద్ధమే తెచ్చుకొంటిని నేను
అతని చంపుటో నేను చచ్చుటో
అంతె గాని ఇపుడేల భీతిలుట
పిరికిపందవలె శరణు జొచ్చుట?
పాపపుణ్యములు నాకును తెలియును
ప్రారబ్ధము ఎట్లున్నదో తెలియదు
కాని యిపుడాతని శరణు కోరను
పిరికిపందనై బ్రతికియుండను
అనుచు తన నిర్ణయమ్ము తెలిపె నా
రావణుండంత కృతనిశ్చయుడై!



ఘజల్ : హనుమంతుడు లంకనుదాటి సంద్రముపైన సాహసయానము
చేయుచు సరగున చేరెను రాముని పాదసన్నిధికి
సాధ్విసీత కబురందిన రాముని కన్నులు మోదముతోడ వెలుగగా
తరుణి కిష్కింధ తలపులవలపుల తలుపులు పులకిత కలువలుకాగా
వానర వీరులు దానవ వైరముతోడ కడగండ్లు
ఇడుముల బడుటకు సమరసన్నాహ రణప్రయత్నముల
వడివడి నడచుచు నడుగులు వేయిగ
పుడమి ప్రతిధ్వనులతోడ తడబడగ
పాదధూళి పైకెగసి మేఘముల వోలె కనబడగ
జగతికి ప్రళయము చేరువైనటుల
ప్రగతికి మార్గము తీరువైనటుల
సాగరవాహిని వోలె నడచెనా
వానర సైన్యము; వీరులు, ధీరులు
మహాబలోపేత రణరంగ, వీరకోవిదులు
ఒక్కొక్కం డొక్క సింహ రణకౌశలము
తనవున ఒడిసిన వీర వానరులు
నడచిరి సంద్రము చేరువకాగా!

పద్యం : సీత రావణు చెరలోన చేరియుంట
తెలిసిపోయెను శ్రీరామ సైన్యమునకు
క్షణము సంద్రము దాటిపోగల మటచు
విశ్రమించిరి యారాత్రి వీరవరులు

ఘజల్ : కొండలను పిండి గొట్టగా గలుగు
సాహసవీరుడు సుగ్రీవుడు
ఆకసమునైన అరచేత బట్టు అరివీర
భయంకరు డా హనుమంతుడు

గదతో మోదుచు గంధర్వునైన
పడగొట్టగలుగు జాంబవంతుడు
అటునిటు చేతులతోడ అరివీర
యోధుల చంపెడు అంగదుడు
ఒకడు వాలమున గిరగిర త్రిప్పును

ఒకడు రాళ్ళనే విసిరి చంపును
అడవి యోధులా వానర వీరులు
లక్షణముగ లక్షలు గల్గిరి
అక్షయముగ అద్భుత బలులై!

పద్యం : జలధి ఉప్పొంగి నడయాడుచుండె నంత
సైన్యమెల్లను భీతిల్లునట్లు తాను
దాని దాటుట ఎట్లు శ్రీరామచంద్ర!
యనుచు వానరు లెల్లను యడిగిరంత!

ఘజల్ : అప్పుడు వానరసైన్యము తోడుత
రామలక్ష్మణులు నిలుచుండి
ఆవల లంకారాజ్యము గలదు
ఈవల మనమే ఉంటి మిప్పుడు
క్షణము సంద్రమును దాటిన చాలును
యుద్ధమే మొదట సిద్ధమైయుండు
ఎవరు వీరు లింకెవరు అధ్యక్షులీ
మహాసైన్యమునకు మున్ముందు
ఎవరు యుద్ధరంగమును జయముతో
నడుపగ జాలెడు వీరశేఖరులు
మొదట మనమిట్టి విభజన చేయగ
వలెను ఆ పిదప సంద్రము దాటుట

పద్యం : అనుచు శ్రీరాముడా ఉదయమ్మ వేళ
వానరులముందు నిలుచుండి ఒక్కమారు
వివిధ విధముల వానర సైన్యములను
విభజన మొనరింపగా నిశ్చయించె!

ఘజల్: 1. మహాబలుడు సుగ్రీవు డధ్యక్షు
డౌను యుద్ధమున కాది యంతము!
సైన్యమెల్ల నడయాడగా వలయు
నాతని యిష్టప్రకారము!
ఉపాధ్యక్షుడగు అంగదుడు
సలహాదారుగ జాంబవంతుడు
రామలక్ష్మణుల కంగరక్షకుడు
వాయుపుత్రుడా హనుమంతుడు
యనుచు విభజించి సైన్యమెల్ల
సంసిద్ధము చేసెను జాంబవంతుడు.

పద్యం : జాంబవంతుడు యీవిధి సైన్యములను
వర్గ విభజన గావించి వినయముగను
రామ! యిది నీకు సమ్మతమే గదయ్య!
యనిన తలయూచి శ్రీరాము డనుమతించె!

ఘజల్ : మిగిలిపోయినది సంద్రము దాటుట
ఎట్లును ప్రశ్నాపత్ర మొక్కటే!
అది వానరులకు, రామలక్ష్మణుల
కందని ఘోరసమస్య రూపమే
చూచి చూచి శ్రీరాము డొకమారు
లక్ష్మణా ఏమిచేతమని పల్కె
ఆగ్రహమ్ముతో లక్ష్మణు డిట్లనె
బ్రహ్మాస్త్రమునే విడిచి సంద్రమును

అవిరి చేయుము దారి కలుగును
నడిచి పోవగా వీలు కలుగునవె
అది విని వానరులంత భయముతో
రాముని జూచిరి ప్రళయమేల యని

పద్యం : లక్ష్మణా! నీదు పల్కులు నిజమెగాని!
ప్రళయ మేర్పడునయ్య బ్రహ్మాస్త్ర విధిని

యది యనర్థక మౌనెంతో యవనికెల్ల
అయిన తప్పదు యంతటి ఆగ్రహమ్ము!

ఘజల్: ధ్యాననిష్ఠలో తాను కూర్చుండి
సముద్రు కొరకయి చేసె ధ్యానము
అతడు కనబడిన సంధి కుదిరించు
కొనగ తలపోసె రాముడా క్షణము
పొద్దులు పొద్దులు గడచినగాని సముద్రుడు
కనబడడాయెను సౌజన్యముతో
విసిగివేసారి రాముడు లేచెను
ఆగ్రహమ్ముతో విల్లు సంధించె
బ్రహ్మాస్త్రముతో క్షణములోన యీ
జలధి నెల్ల నిర్జించెద ననుచు
గడగడ వణుకుచు తాను కన్పించె
సముద్రు డంతట శాంతించు మనుచు
రాముని వేడెను కరములు ముకిచి
శరము నుపసంహరించు మని పల్కె

పద్యం : కాలనియమము మాత్రమే కాద నేను
చేయుచున్నట్టి యీపని రామచంద్ర!
ఆగ్రహమ్మేల నాపయి నంత ఘోర
నేర మేమున్నదయ్య నా నిర్ణయమున.

పద్యం : జలములుండుట సంద్రము నందుగాక
జనుల మోముల నుండునా జగతిలోన
నీదు కార్యము జెప్పిన నాకు తోచి
నట్టి సాయము జేయుదునయ్య రామ!

ఘజల్ : అనిన సముద్రుని గాంచి శ్రీరాము
డంత తన బాధ తెలిపె నతనితో
జలధి దాటగా వలయు వానరులు
తగిన సూచనలు తెలుపుమని పలికె

అది విని సముద్రరాజు చింతించి
యిట్లని పలికెను సమస్య తీరగ

రామ! నీనామ స్మరణచే రాళ్ళు
బరువు కోల్పోయి నీటిపై తేలు
నిది నేనిచ్చిన వరము గైకొనుము
వారధి కట్టుము! లంక చేరుము!

పద్యం : అనిన వానరసైన్య మానంద మంది!
రామనామము వ్రాయుచు రాళ్ళనెల్ల
తెచ్చి పడవేయ నవి నీట తేలియాడె
కొలది దినములలోన వారధిగ నిలిచె!

పద్యం : రామ నీ నామమునకున్న శక్తి యేమి?
రాళ్ళు నీళ్ళందు తేలిన రమ్య మేమి?
నీవు మానవ రూపున నిల్చియున్న
హరివి! గాకున్న సాధ్యమా! సురులకైన?

పద్యం : అనుచు వానర వీరులు భక్తితోడ
రామనామము భజనగా తలచుకొనుచు
సాగిపోయిరి దాటుచు సంద్రమెల్ల
ఔర! విధి లీల యీ విధి యుండెగాదె ?



# 8

ఘజల్ : చెలగి రావణుండంత తనపైకి రాముడేతెంచు విధము
తెలుసుకొని, సర్వసైన్యముల పిలిచి యుద్ధమునుగూర్చి తెలిపె
మేఘనాథు డాతని పుత్రుడు; యుద్ధమే మేలుమేలని పలికెన్,
సర్వసైన్యములు రాజు యాజ్ఞలను వినగ తలఢోసి నిలిచెన్
అంతట రావణు సోదరుండు ధర్మాత్ముడైన యా విభీషణుండు
అన్నా! యిది యన్యాయము రాముని శరణు వేడుమని పలికె
అది విని రావణు డాగ్రహమ్ముతో ఎగిరి గంతులే వేసి
చట్టసభ నుండి తొలగి పొమ్మంచు అవమానమునే చేసె
తలను దించుకొని విభీషణుం డటనుండి క్షణములో వెడలెన్

పద్యం : రాముడావలి ఒడ్డును దాటినాడు
తరలి వచ్చుచున్నాడు తరుణి గావ!
యన్న వార్తలు జానకి చెవుల సోకి
తనవు పులకించె సంతస మామెలోన!

పద్యం : రావణుండెటు మరణించు; రాక్షసాంగ
నలకు తప్పదు శిక్షని త్రిజట తనదు
స్వప్న వృత్తాంత మెల్లను తెలిపినంత
శోకమెల్లను తొలగె యశోక వనిని!

ఘజల్ : అప్పటి వరకును జానకి నచ్చట హింసలు పెట్టినవారే!
ఆమెకు సేవలు చేయ మొదలిడిరి పట్టపురాణిని బోలి,
త్రిజట స్వప్నమును నిజమని నమ్మిరి రాక్షసాంగనలు యంత
తల్లీ మమ్ముల కాచి రక్షించుమనుచు ప్రార్థించి రంత!
తెలియక చేసిన తప్పులేగానీ తెలిసి చేయలేదమ్మా!
రావణు యానతి మేరకు ఈవిధి చేసితి మంతే నమ్మా!
యనుచు రాక్షసాంగనలు జానకిని వేడుకొనిరి తామంత!

పద్యం : అంత నా యశోకవనమునందు సీత
సంతసమ్మున రాఘవు తలచుకొనుచు
దిన దినంబును యుద్ధ వార్తలను వినుచు
గడప సాగెను దినమొక్క గడువుకాగ!

ఘజల్ : యుద్ధమే వచ్చి, లంక నాశనమైన విధి నొక్క కలను
కనెను మండోదరీ మహాసాధ్వి భయమున రావణుచెంత చేరెను
ఇప్పటికైనను మించలేదింక మొండిపట్టు విడుమయ్యా
సీత నాతనికి యిచ్చి, మన తప్పు గావగా కోరుమయ్యా
యనెడు మండోదరీ పలుకులు విని విసుగు చెంది రావణుడు
చచ్చిన చత్తునుగాని వానినిక శరణు కోరనని తెలిపె

పద్యం : అతని మనసున క్రోధము; ఆత్మలోన
లంక పడిపోవుచున్నట్టి లక్షణములు
ఓటమిని పొందుచున్న దుశ్శకునములును
కలిగి రావణు డలతట కలత చెందె!

ఘజల్: 1. తాను తలచినది నిజముసేయగల జగజ్జట్టి రావణుడు
శివుని మెప్పించి ఆత్మలింగమును పొందినట్టి నిర్భయుడు
అష్టదిక్పాలకులను బెదిరించి గెలిచినట్టి రాక్షసుడు
తనదు పేర్విన్న భువన భవనములు కదలిపోవగా
భయము చెందగా చేసినట్టి రణరంగ ధీరుడు "తానుతలచినది"

2. ఒంటరై పోయినట్లుగా వగచెనపుడు
కంట నీరుపొంగ కలత పడెనపుడు
క్షణక్షణమ్మున తనకు మరణ మాసన్నమై
తరుముకొచ్చిన యట్లు తడబడెను మనసులో "ఒంట"

పద్యం : గుండె లోతులు భయముతో గుంజులాడ
రావణుండంత తనరాజ్య వీరవరుల
సభకు రప్పించి, యాసీను లవగజేసి
వివరముగ తెల్పె నా విపత్కాలమెల్ల!

ఘజల్ : వీరులారా! రాక్షస యోధులారా!
రణరంగ మార్తాండ విక్రములారా!
నరవానరులు సంద్రమును దాటివచ్చిరి
యుద్ధమే క్షణమునో జరుగు నికచూడుడి
మీరెల్ల నావెనుక నడిచి రణమే చేసి
రాక్షసుల మర్యాద కాపాడగావలయు ॥వీరులారా॥

పద్యం : అనుచు రా..ణు డావిధి విన్నవించ
రాక్షసేశులు రణమున పోరు సల్పి
నీకు విజయము చేకూర్తు మనుచు పల్క
రావణుడు కొంత భయమును వీడి నిలిచె!

పద్యం : తనదు బలమే యపూర్వ సైన్య మగును
మేఘనాథుడు, కుంభకర్ణాది యోధ
సైన్యమున్నది లక్షలకొలది యింక,
రాముడొక్కడు, వాడేమి సేయగలడు?

ఘజల్ : నరుడట! వానరులట! వాని సైన్యమట!
నవ్వులపాలై పోవుట తప్పదట! ॥నరుడట॥
తోక లాడించుకొనుచు గంతులే
వేయుట యుద్ధము సేయుటనుకొంద్రు
యుద్ధమన్నచో పిట్టల కొట్టుట
కాదవి అతనికి తెలియును ఇకనైనా ॥నరుడు॥
తండ్రిమాట కొరకని కానల కేగుట
కాదురా రామ యుద్ధమన్నచో
తరుణి కోరికను తీర్చగ హరిణిని
కొట్టుటలు కాదు రణము సేయుట
లక్ష తలలు తెగి నేలపై బడుట
అక్షయునితో యుద్ధము సేయుట
నీవో నేనో ఒకరే బ్రతుకుట
కాచుకొనుము రావణునికి ఎదుట! ॥నరుడట॥

పద్యం : తనదు సైన్యపు బలమును తరచి చూచి
రావణుండంత భయమును పారద్రోలి!
యుద్ధమునకన్ని ఏర్పాట్లు చేసి వచ్చి
హాయిగా ఒరిగి విశ్రాంతి నొందెనంత!

# 9

ఘజల్ : రావణుని వీడిన విభీషణుడు రన ధర్మమార్గమున బోవ
విశ్చల చిత్తుడుగాగ వడయాడి రాముని సన్నిధి చేరుకొనెనంత
రామ శ్రీరామ నీదు దాసుడను నిన్ను శరణమ్ము కోరినవాడను
నన్ను దయజూచి నీదు పక్షమున చేర్చుకొమ్మనుచు
మిగుల ప్రార్థించె
అంతట రాముడు సాదరమ్ముగా విభీషణుని కూరుండబెట్టుకొని
అభయమిచ్చి తన యనుజుని వోలెను రక్షణ సేయుదుననెను
రాముని విజయముకొరకు తానింక పోరు సేతునన విభీషణుడు
పట్టరాని సంతోషమ్మున వానర వీరులు జయజయ ధ్వనులు
సేయగా

ఘజల్ : ధన ధన ధన ధనా ధనా; వానర
ధరణి నడచి వచ్చెను రామా!
ఇంక నీవాజ్ఞ ఇచ్చిన క్షణమే
లంకను బూడిద సేతుము రామా! ॥ధన॥

యనుచు సుగ్రీవు డంత శ్రీరాము
వడిగె లంక సామీప్యము జేరగ
రాముడు ఒక పరి యాలోచించి
రాయబారమును సేయ మూహించె ॥ధన॥

పద్యం : రాయబారము సేయగా రావణుండు
సమ్మతించునొ లేదొ సందేహపడక
అతని సభలోన కేగి నా వాక్యములను
తెలిపి రాగల ధీరులు తెలుపరయ్య!

ఘజల్ : అనుచు శ్రీరాముడంత వానరుల
నెల్ల వీక్షించె క్షణము;

ధీరుడు అంగదు డంత నిలుచుండి
వెళ్ళి వత్తునని పలికె;
అంత శ్రీరాము డాతని తోడుత
ఈ విధి పలికెను ప్రశాంతమ్ముగా

పద్యం : తెలుసుకొనలేక శ్రీరాము భార్య యనుచు
అపహరించిన సీతను అప్పగించి
శరణు కోరిన నీపయి దయనుజూపి
విడిచి పెట్టుదు; తప్పు మన్నింతు ననుము!

పద్యం : యుద్ధమే నీకు కావలెనన్న మేము
భేరి మ్రోగింతు మింక నాలస్యమేల?
కాచుకొమ్మని చెప్పుము లంకనెల్ల
రామబాణము దహియించు ననుచు తెలుపు!

పద్యం : రావణా! నీకు మరణము రాసియుండి
సీత నీవిధి చెరబట్టి చిత్రహింస
చేసినా విక తప్పదు నీకు శిక్ష
యనుచు రాముడు తెలిపె నంచనుచు తెలుపు!

ఘజల్ : రాముని సందేశమ్మను గైకొని యంగదుడట సెలవందుకొని
గదను గిరగిరా త్రిప్పుచు నడచుచు రావణు సభలో చేరె
ఎవడురా నీవు? ఎందుల కిట కేతెంచితివని రావణుడు
ఆగ్రహమ్ముతో పలికి యంగదుని యవమానం బొనరించె

పద్యం ; ఓరి రావణా! నీకు చావొచ్చి నిలిచి
కన్నులందున కండ కావరము కమ్మి
మదపు ప్రేలాపనలు చేయుచుంటి వౌర
రామ బాణము నిన్ దహియించు నింక.

పద్యం : పరుల సతి పొందు గోరుట పాపమన్న
ఇంగిత జ్ఞాన మైనను నీకు లేదు
వేద పండితు డంచును విప్రవీగు
చుందు విధి నీకు తెలియదో శుంఠ! మూర్ఖ!

ఘజల్ : అనుచు నంగదుడు రాముడు చెప్పిన సంధి పలుకులను తెలుప
ఆగ్రహమ్మతో రావణుండంత తన సైనికులను పిలిచి
ముందు వీని మదమణగదీయుడు పిదప రాముదిని చూడవచ్చును.
పట్టి బంధించి, వీని కడతేర్చి శవము రామునికి చేరవేయుడు

పద్యం : అనిన రావణు పల్కుల నాలకించి
పదుగు రొక్కటిగా వడి పైనబడిరి
అంగదుడు వారి నెల్లను యాడ్చివేసి
రావణా; వినుమింక శ్రీరాము పలుకు

పద్యం : ఇంకనైనను సీతను యప్పగించి
శరణు కోరుము; లేద నా శరము లెన్నొ
లంకనెల్లను దహియించు నిన్ను చంపు
నిజము గ్రహియించి మసలుకొమ్మింకనైనః

పద్యం : సంధి కావలెనన్నచో నన్ను చేరి
శరణు కోరుము లేదన్న యుద్ధభేరి
మ్రోగు నిక యుద్ధమే మరునాటి నుండి
నీదు పలుకులు తెలుపుము నిక్కముగను.

ఘజల్ : అంగదుని పల్కు లాలకించి తన
యాగ్రహము వెళ్ళగ్రక్కి
ఓరి వానరాః నేను రావణుడ
సకల లోకములు గడగడ లాడిన
వీర భయంకర రాక్షసేశుడను
హరుని మెప్పించి యాత్మలింగమును
పొందినట్టి శ్రీ శైవ భక్తుడను
మరణమే లేని వీరుడను నేను
నన్ను బెదిరించు నీదు పలుకులు
నవ్వు తెప్పించు నాకు తెలుసుకోః
సురాసురులు యక్ష గంధర్వులు
కిన్నర కింపురుషులు నను చంపలేక

పారిపోయిరి రాజ్యముల వీడి
నరులు వానరులు నన్ను చంపుటా
ఎట్లు సాధ్యమో తెలుసుకొమ్మనుము
వెళ్ళి పొమ్మింక చేరి రామునికి
తెలుపుమా యింక యుద్ధమే యని
రణమొ మరణమొ అక్కడే తేల్చు
కొందుము సంధికి ఒప్పుకొనమోయి!
వెడలు మింక యా రాముని కనుగొని
చెప్పుమా నాదు పలుకులని తెలిపె!

పద్యం : అంగదుడు రావణుని మాటలన్ని వినుచు
ఓయి! నీకింత కండకావరము గలదొ?
నరులు వానరులన్నచో నవ్వులాట?
చేవ గలదేని నాదు పాదమును గదుపు?

ఘజల్ : అనిన విని రాక్షసేశు డంత తన సైనికులం బిలిపించి
అంగదుని పాదములు బట్టి యీడ్చి పడగొట్టుండని పలికె.
బిలబిల రాక్షస సైన్యము అంగదు పాదములం పడగొట్ట
గిరగిర తిరుగుచు బలమున గుంజుచు ప్రయత్నించి విధి లేక
ఓడిపోయిరి బిక్కమొగములతో రాజు గని తలలు వంచి
సాధ్యము కాదని పలికిరి అది విని అదరిపడెను రావణుడు
పకపక నవ్వుచు పైకి ఎగురుచు వెడలిపోయె అంగదుడు

పద్యం : ఒకడు వానరు డానాడు వచ్చి లంక
నెల్ల కాల్చియు హాయిగా నెగిరిపోయె
ఇపుడు ఇంకొక వానర ముష్కరుండు
వచ్చి ఈ విధి మన నవమానపరచె!

పద్యం : యుద్ధమున మీరు వీరాధి వీరవరులె
కాని యావలి పక్షము కాంచిచూడ
గెలువజాలుదుమా యని గ్లాని కలిగె
యిపుడు నిర్భీతి మీ యభిప్రాయ మిందు!

ఘజల్: 1. అనుచు రావణుడు తన మది లోతుల
కలత చెంది సైన్యము తోడుత
పలికె మీరింక మీదు భావముల
తెలియ జెప్పుడని తెలిపినంతనే
విభీషణుడు రావణుని సోదరుడు
నిర్భయముగ నిలుచుండి పలికెను

ఘజల్: 2. అన్నా: ఇది అన్యాయము యుద్ధము
నష్టదాయకము లంక కంతటికి
సీత నికనైన రామునకు చేర్చి
క్షమాభిక్ష నర్థించుము వేగమె
అది మన జాతికి, లంకకు, నీకు
అన్ని విధంబుల ఉత్తమంబగును. ॥అన్నా॥

ఘజల్: 3. అనిన విని రావణుండు నాగ్రహము
పెల్లుబుకగ తన యాసనము వీడి
లేచి నిలుచుండి ద్రోహీ! యనుచు
సభను వీడి వడివడి నడచుచు
విభీషణుని దరి చేరుకొనె నపుడు ॥అనిన విని॥

ఘజల్: 4. ఒకటికి పదిమార్లు నన్ను నారాముని
పాదము లంటుకొను మనుచు
నీవు చెప్పుదువు నీచుడా యింక
నాదు రాజ్యమున ఉండగా తగవు!
తమ్ముడవని కరుణించి ప్రాణముల
విడిచి పుచ్చితిని పారిపొమ్మింక
నాదు రాజ్యమున ఒక్క క్షణమైన
ఉండగా తగవు వెడలి పొమ్మింక

పద్యం : అనుచు రావణు డాగ్రహోదగ్రు డగుచు
నా విభీషణు నటనుండి వెడలగొట్టె
కనులలో నీరు నిండగా కలయజూచి
సభను విడిపోయె నా విభీషణుడు నంత!

ఘజల్ : మనసు లోతులన్ కలత చెందగా సభను వాయిదా వేసి.
గృహమున చేరెను రావణుడంత మండోదరి చేరన్.
విభీషణుని శిక్షించిన తీరును మండోదరి ప్రస్తావించి
పదుగురు శత్రువుచోట లాభమా తెలుసుకొమ్మంచు పలికె.
మిగుల చింతించి, రావణుండంత మండోదరి దరిచేరి.
మనసు పొరనింక తొలచివేయకుము మరణము వచ్చిన రానీ
చచ్చిన చత్తునుగాని రామునితో యుద్ధమె నేతునుగానీ
శరణు కోరనిక. మారుమ్మాటాడబోకు యిక చాలుననియె.

పద్యం : పరుల సతికోరి ప్రాణము తీసికొనగ
కలిగె దుర్బుద్ధి నిన్నిక కాచు టెట్లు
దైవమా! నాదు ప్రారబ్ధ మిట్టులుండె
ఎవరి నని యేమి లాభము? ఏమి ఫలము?

ఘజల్ : అనుచు మండోదరీ దేవి మహాసాధ్వి మనసున క్షోభను పొంది
దైవమును గూర్చి పరిపరి విధముల మిగుల చింతించెనపుడు
రావణు డంతట యాగ్రహమ్ముతో మండోదరి దూషించి
బిర బిర నడచుచు వెడలిపోయె తన ఏకాంత మందిరముకు
లంకలోన దుశ్శకునము దోచెను గ్రద్దలు, బోధలు ఎగిరి
దుశ్శబ్దములను చేయసాగెను భయకంపితులై ప్రజలు
జరగనున్న దుర్ఘటనలు తలచుక భీతితో మిన్నకుండ



ఘజల్ : ఉదయ కాలమున మ్రోగె రణభేరి రాముని శిబిరములోన
బిలబిల బిలబిల వానర సైన్యము పరుగున లంకను చేరి
రాక్షస సైన్యము పైకి ఆయుధము ప్రయోగించగా సాగె॥
లక్షలు లక్షలు రావణ సైన్యము రణమున పరుగులు తీయ
కదనరంగ మిక, కరకు కత్తులతో పీనుగ పెంటలు కాగ॥

పద్యం : స్వయముగా రామలక్ష్మణు లచట నిలచి
యుద్ధమున వానరులు వేగ ముద్యమించి
యసుర గణముల నెల్లను యంతరించ
నేయగా ప్రోత్సహించిరి; శక్తి తీర॥

ఘజల్ : అపుడు మేఘనాథుడు ఆకాశంబున నిలబడి తాను
బాణ వర్షమే కురవగా చేసి వానరులను భయపెట్టె
అదృశ్యమ్మగా వానరుల చంపు రావణు పుత్రుని చూసి
వానర సైన్యము భయమున రాముని సన్నిధి చేరెను క్షణము॥
అంతట లక్ష్మణు డస్త్రమును పట్టి ఆకాశము గురిపెట్టి
రావణు పుత్రుని పైకి బాణమే విడిచెను తా పగబట్టి
క్షణమున బాణము ఆకాశమ్మున విరిచెనా మేఘనాధుడు భయమున
ఇరువురు వీరుల అస్త్రశస్త్రముల ఆకాశము ధగధగమండి
ప్రళయకాల భీభత్సము కల్గెను ప్రపంచమే భయపడగా॥

పద్యం : మేఘనాథుడు అదృశ్యరణ పిశాచి
ఆతని మాయల యుద్ధము లంతకంత
చిత్తక్షోభను కల్గించె చిత్ర మయిన
వాని ఆయుధ వర్షము వానరులకు.

ఘజల్ : విడచె నొక బాణమంతట లక్ష్మణుడాకాశమ్మను చేర
దాని పడగొట్టి మేఘనాథు డింకొక యస్త్రము వేయ

క్షణములోన లక్ష్మణుడు పడిపోయె, వానరులు భీతిపడగా
రాముడా ర్తజన రక్షకుడు దుఃఖసాగరమందున మునుగ!

పద్యం : మిగుల దుఃఖించె రాముడు మానసమున
లక్ష్మణా! నీదు సేవలు లక్షలాది
అనుజులందరకును మార్గదర్శకములు!
నీదు చరితము ధన్యమౌనయ్య స్వామి!

ఘజల్ : సీత వలదు ఈ యుద్ధమే వద్దు ఏల నాకు ఈ వృథా జీవితము
నేను సైతము ఆత్మహత్య కొనసాగించుదు ననుచు
అంత రాముడా యుద్ధరంగమున అస్త్రసన్యాసి కాగ!
సుగ్రీవాదులు యనునయించి, కర్తవ్యోన్ముఖు చేసి
కాగల కార్యము చూడవలయు నిపుడింక లెమ్మనుచు లేపె;

పద్యం : అంత సూర్యాస్తమయమాయె నంతలోన
యుద్ధమును నిల్పి, సైన్యము సేద దీరె
జాంబవంతుడు లక్ష్మణు చేయి జూచి,
కాదు మరణము, మూర్ఛిల్లె నంచు తెలిపె.

ఘజల్ : తిరిగి సంతోష పులకిత మాయెను రాముని మనసాక్షణము
ఏది లక్ష్మణుని తిరిగి లేపుటకు లేపన మేదని పలుక
సూర్యోదయ కాలము లోపల హిమాలయములను చేరి
సంజీవని తెచ్చిన చాలును తిరిగి లేచునని పలికె
అది ఏవిధముగ తేగల మనుచును తిరిగి నిస్పృహలు పడగ
వాయుపుత్రుడా క్షణమున ఎగిరెను సంజీవని కొనితేగ
చిత్తమున క్షోభ పొంగిపొరలగా రాముడట కూలబడగ!

పద్యం : తనదు ఆత్మకు మరణమా యన్నరీతి
పొంగిపొరలెను రాముడు దుఃఖపడుచు
లక్ష్మణా! నిన్ను గొనివచ్చి యుద్ధమందు
నిలిపి యన్యాయముగ చంపుకొంటినయ్య!

పద్యం : అమ్మ సౌమిత్రి కేమని తెలుపువాడ?
ననుచు రాముడు మిగుల దుఃఖించుచుండ
ప్రొద్దు జారెను చీకటి తెల్లవార!
వచ్చుచుండగ వానరులంత యేడ్వ!

ఘజల్ : దూరమున నొక్క వెలుతురు వెలిగెను చీకటి దారులలోన
ఆకసమెల్ల సూర్యకాంతివలె నిండెను సామీప్యమున
అదుగో అక్కడ హనుమంతుండ వానర వీరులు మురువ!
ముదమున రాముడు సంతోషము గొని లేచెను ఆశలు నిలువ

పద్యం : అంత హనుమంతు డచ్చట దిగెను క్షణము
యచట సంజీవి గుర్తించ నలవిగాక
పర్వతము దెచ్చినాడను చూడుడనుచు
తనదు చేతుల తోడుత దించినాడు.

ఘజల్ : హనుమంతుడు తెచ్చిన పర్వత భాగము నిశితముగా పరికించి
జాంబవంతు డందు కనుగొనెను సంజీవిని గుర్తించి
దాని సాయమున తక్షణమే యట లక్ష్మణుని బ్రతికించి
మిగుల సంతోషభరితులైరి రామలక్ష్మణుల గాంచి

పద్యం : మృత్యువాతను బడిన వానరుల నెల్ల
వేడ్క సంజీవి తోడుత జన్మనిచ్చి
మరల జీవుల జేసెను జాంబవంతు
డంత రాముని సైన్య ముప్పొంగిపోయె!

పద్యం : జయజయ ధ్వనులంతట మిన్ను ముట్ట!
రామనామము మహిమాన్వితమ్ము గాగ!
తిరిగి సూర్యోదయమ్మున ఉద్యమించి
యుద్ధరంగమునందున దూకినారు!



# 11

ఘజల్ : ధరణి యుప్పొంగినట్లు వానరులు రాక్షస మూకల దునుమ
క్రుద్ధు డైనట్టి ఇంద్రజిత్తు పునరాగమనము సేయ
ఆకసమ్మునందుండి యాతడట మాయా యుద్ధము జరుప
తిరిగి భీతిల్లి వానర యోధులు పలాయనము చిత్తగించ
భయపడకుడు ఇదె చివరి ఆయుధము తిరిగి లేవడని లక్ష్మణుడు
వానర యోధుల కభయమిచ్చి, తన ఆయుధ విద్యను తలచి,
క్షణము మదిలోన మంత్రమే తలచి, ఆకసమ్మునన్ విడిచె,
హాలాహల జ్వాలలు చిమ్ముచు బ్రహ్మాస్త్రము నడయాడి,
ఇంద్రజిత్తు గుండెలు చీల్చెను పుడమిపై బడగ నిర్జీవమునన్.

పద్యం : దిక్పాలకుల గెల్చినట్టి ఓ ఇంద్రజిత్తు
నీదు మరణము నాదు ఆగ్రహములు గొలిపె
నాయనా నిన్ను పొట్టన పెట్టుకున్న
పరమ పాపిష్ఠి తండ్రిని నన్ క్షమించు!

పద్యం : భుజబలమ్మున దేవత లెల్లవారి
గెల్చి మన కీర్తి దిగ్గంతములకెల్ల
చాటినావయ్య! నిన్ను కోల్పోయినాను!
యింక దిక్కెవరనుచు రావణుడు యేడ్చె!

ఘజల్ : అరివీర భయంకర భీకరాకార ఘోర భుజబలోపేతుడగు వాడు
నాదు సోదరుడు కుంభకర్ణుడు; వాడినిక నిద్ర లేపుడని చెప్ప
సైన్య మెల్ల నడయాడె నారాత్రి, కుంభకర్ణుడిని నిద్రలేపగా
తప్పెటలును తాళములు మ్రోగె, ఏనుగు ఘీంకారములు వినిపించె
విశ్వప్రయత్నము చేసి యా పిదప నిద్ర లేపిరా కుంభకర్ణుని!
అతడు భీకరాకారుడు విసుగున నిద్ర లేచి విని రావణునాజ్ఞ
ఆగ్రహమ్ముతో నడిచె యుద్ధమున కంతట రాక్షసు లానందించగ

పద్యం : భీకరాకారుడా కుంభకర్ణు డంత
యుద్ధ రంగమునందున వానరులను
చీమలను నల్చినట్లుగ చంపుచుండ
భయము తోడుత వానరుల్ పారిపోవ

పద్యం : తనదు సైన్యము భీతిలి పోవ జూచి
రామ లక్ష్మణు లిద్దరు రక్ష సేయ
ఆయుధమ్ములు కురిపించినారు గాని
కుంభకర్ణుడు ఈగల వోలె దులిపె

ఘజల్ : ఆయుధమ్ము లా రాక్షసుని ముందు హాస్యాస్పదమై పోవుటను
గాంచి
రాముడు ఖిన్నుడుకాగ లక్ష్మణుడు ధైర్యమే చెప్పినంత
సాయంకాలమ్మగుటచేత యానాటికి యుద్ధము నాపి
గుడారమ్ములకు చేరుకొనిరి యానాటికి బ్రతికితి మనుచు

వచనం : ఆ మరునాడు యుద్ధరంగమున శ్రీరాముడు స్వయముగా! కుంభకర్ణుని ఎదిరించి నిలిచె. ఆతని భీకరాకారము వానరులను భయభ్రాంతులను సేయగా, తన దివ్యాస్త్రములలో శ్రీరాముడు కుంభకర్ణుని కూల్చివేసెను.

ఈ వార్త విని రాక్షస సైన్యము భయాందోళనలతో పారిపోగా, వానర సైన్యము ఆనందోత్సాహములతో ఉప్పొంగిపోయెను

రాజమందిరమున రావణుడు తన సోదరుని వార్త విని ఖిన్నుడాయెను.

పద్యం : శివ శివా! యిట్టి వార్తలు వినుట కొరకె
బ్రతికి యున్నది తనువింక భాగ్యమేమి?
కలదు జీవిత మందున కలత తప్ప?
యనుచు రావణు డంతట దుఃఖమందె!

పద్యం : సకల శాస్త్రాలు చదివిన సారమెల్ల
పడతి జానకి గొనివచ్చి పాడుజేసి
ప్రాణ భయమును గొనితెచ్చుకొంటి నేను
కట కటా! యింక నను గావ నెవరి తరము?

పద్యం : సోదరా! నన్ను విడనాడి స్వర్గమునకు
వెడలి పోయితివయ్యా నీ వెంట నేను
రాక, తప్పదు! ఓటమి రాక్షసులకు
బ్రహ్మ లిఖియించె. తప్పదు బాధపడిన!

ఘజల్ : సురాసురుల ఓడించి గెలిచి రణరంగమునందున నేను
అరివీరుండను, అజేయుండనై తిరిగిన ఫలితము యేమి?
నరుడు వానరుల తోడుగొని వచ్చి, నన్ను ఓడించినాడు
కాలచక్రమా! నన్ను ఈ విధిని గెలుచుకుంటివో యమ్మ!
యనుచు రావణుడు మనసులోన పరిపరి విధముల యేడ్చె!
సుదతి మందోదరి తన భర్తకు జరిగిన ఓటమి చూసి
పడి పడి యేడ్చెను, ప్రాణమైన కాపాడుకొమ్మనుచు వచ్చె.

పద్యం : దరికి జేరిన భార్యను రావణుండు
చూచి యిట్లనె ఓటమి చూడవలసి
యుండె కాబోలు యింకను బ్రతికి యుంటి
అయిన యికనేమి ప్రారబ్ధ మనుభవింతు.

ఘజల్ : అనుచు మందోదరిని తన బాహువులందున పొదిగి
భయము చెందకుము రాజుల జీవితమెల్ల కాలమొక విధిగ
నడవదు! కష్టము సుఖములన్నియు, కలబోసి వచ్చుచుండు
యనుచు ధైర్యమె చెప్పగా యామె చివరి విన్నము చేసె.

పద్యం : ప్రాణభయమేల యికనైన ప్రాణనాథ!
రామునకు జానకీదేవి నప్పగించి
సంధి యొనరించుకొనుము శాంతమ్ముతోడ
మరల నొకసారి యోచన సేయుమయ్యా!

పద్యం : పిరికి పందను కాలేను పిచ్చిదాన!
మరణమే నన్ను గెల్చిన బ్రమంది పోదు!
నంతమాత్రమునన్ భయ మంది యిపుడు
యతని శరణందునా! యది సాధ్యమగున?

పద్యం : జీవితమ్మెల్ల నా సహధర్మచార
విధిని నడయాడి నాకెంతొ సేవ చేసి
నావు! నీ సేవ కిప్పుడు ధన్యవాద
మంద జేయుచు నుంటినో మగువ! నీకు!

పద్యం : రేపు మరణము తప్పదు నాకు గాని
అయిన ఈవేళ సంధి ప్రయత్న మేల?
రణమొ? మరణమొ? రాజుల జీవితమున
సంధి యనుమాట తుచ్ఛమౌ సాక్ష్యముగను!

పద్యం : చివరి మాటలు నావింక చింతమాని
వెడలి నిద్రించుమా యిక వేకువౌకటె
మిగిలి యున్నది నీకును నాకుగాని
దాని నీ విధి వృథ సేయనేల యింక!

ఘజల్ : అనుచు రావణుడు సాధ్వి మండోదరికి వీడ్కోలును పలికె
కన్నుల లోతుల నీరు కాల్వలై పారగా దుఃఖ మంది
విహ్వాలమై నడయాడె మండోదరీ తన యంతఃపురమునకు
భర్త విజయమును గోరి దైవమును లెస్స ప్రార్థించెనంత
భళ్ళున తెల్లవారినది భయభ్రాంతు లవగ రాక్షసులు
యానందముతో కేకలు వేసిరి యంతట వీరులు వానరులు
వింత శోభతో సాక్ష్యమిచ్చె నా యుద్ధమున బాలభానుడు



# 12

ఘజల్ : సురాసురులు గడగడ లాడగ
ధరణీ తలమే దడదడ లాడగ
రామరావణులు రణ మొనరించిరి
అష్టదిక్పతులు హడలి పోవగా
ఒకరిపై నొకరు శరపరంపరగ
బాణ వర్షములు కురిపించుకొనిరి
నరులు, వానరులు, రాక్షస వీరులు
సంభ్రమాశ్చర్య సంచితులు కాగ
ఆకాశమ్మున వింత కాంతులతో
ఆయుధములు విభ్రాంతి కల్గించ
రణము కొనసాగె రామరావణులు
ముఖాముఖీ తలపడి పోరగ
హోరా హోరీ పోరి రావణుడు
నిరాయుధుండై నిలిచె నా క్షణము
రాముని ధాటికి ఆయుధమ్ము
లొక్కొక్కటి పడె నా భువిపైన
క్షతగాత్రుని వలె నిలచి పోయెనట
స్థాణువు పోలెను రావణుడు
అది గని రాముడు జాలిపడె నంత
చిత్తశాంతితో పలికె ఈ విధిగ!

పద్యం : రావణా! నేడు రణమున యలసినావు!
ఆయుధమ్ములు చేజారి నిలచినావు.
యిట్టి నిను చంపు టే విధి శౌర్యమగును
వెడలి! విశ్రాంతి గైకొని రేపు రమ్ము!

ఘజల్ : అనుచు రాము డా రాక్షసేశు గని
కొంత విశ్రాంతి పొందగా విడిచె
యవమానమ్మున రావణుడు యుద్ధ
రంగమును వీడి రాజసభ చేరె!

పద్యం : తనదు పితరుల తలచుక రావణుండు
కొంత దుఃఖించె! తనదు ఓటమిని గాంచి
తప్పదిక నాకు ఓటమి తండ్రులార!
జాతి పౌరుషమెల్ల పోగొట్టినాను!

ఘజల్ : అనుచు రావణుడు పరిపరి విధముల
తనదు ఓటమిని తలచి దుఃఖించె
రాత్రి యంతయును నిద్ర లేకుండ
తన తప్పిదమును తలచి నిందించె
చివరిసారిగా పట్టమహిషి
మండోదరి దరిచేరంగ
వెడలె రావణుడు విహ్వల చిత్తుడు
పదములు తడబడ తాను నడవగా!

పద్యం : దైవ ప్రార్థన చేయుచునున్న భార్య
సుంత విశ్రాంతి నొంది తానెదురు వచ్చి
పతికి ప్రణమిల్లి, కన్నుల నీరుగార!
కుశలమా! యంచు రావణు నడిగెనంత!

పద్యం : రథము విరిగెను రణమున నాదు తలకు
గాయమైనది క్షతగాత్రు నైతి గాదె!
కాంత! కుశలము గాక యింకేమి మిగిలె?
మనసు పరిపరి విధముల కుమిలిపోయె!

పద్యం : అష్ట దిక్పాలకుల గెల్చినట్టి నేను
నరుని ముందర నిలువంగ నోపనైతి!
దయను జూచెను రాముడు నేటి వరకు
రేపు మరణము తథ్యము తెలుసుకొమ్ము!

ఘజల్ : అనుచు రావణుడు దుఃఖభారమున
సతి భుజములపై తలవాల్చి
క్షణము చిత్తమున శాంతిని పొందెను
తిరిగి మనసులో ధైర్యము చేరగ

సుదతీ! రాజ్యభారము నెరపితి
ముదము దీరగా యనుభవించితిని
కోరిన కోరికలెల్ల తీర్చుకొని
ధరణినెల్ల పరిపాలించితి!
యింక నాకేల జీవితము పైన
ఆశామోహము జన్మపాశము!
యిది వీరోచిత మరణమే యగును
వీరనారివై గర్వపడుమింక!
యనుచు మండోదరికి సెలవొసంగి
నడచెను రావణుడంత వడివడిగ!

పద్యం : గడిపె నారాత్రి భారము గాగ బ్రతుకు
తెల్లవారగ రావణు డంత లేచి
నూతనోత్సాహమును పొంది నిలచినాడు
రణము సేయగ ముందుకు కదలినాడు!

ఘజల్ : రథముపై నెక్కి యుద్ధరంగమున
కేగె రావణుడు వడివడిగ
దీటుగ నిలబడి రావణుడు,
రావణుపైన విడువ బాణముల
శరపరంపరగ యిరువురు వీరులు
యుద్ధ విద్యలను ప్రదర్శించగా!
తడబడె రావణుడంత క్షణములో
రాముని బాణము వచ్చి తాకగా!
రథము విరిగె, ఆయుధములు జారెను
సారథి మరణించెను, నుడిపడగా

నిలిచె రావణుడు క్షణకాలమ్మున
నిరాయుధుడు ఒంటరిగా!
యంతట రాముడు తన బాణమ్మున
రావణు తల దునిమెనుగానీ,
తిరిగి జీవితము కల్గి యా తలే
మొండెముతో కలగలసి జీవించె
పెక్కు బాణములు వేసి రాముడే
అలసిపోయె నా సమయమున
అది గని వడివడి వచ్చె విభీషణు
డంత రాము గని తెలిపె రహస్యము
నాభి యందున యమృత మున్నది
అందువలన ఆతనికి లేదు మరణము
మొదట నాభిపై దాడి చేయుము
పిదప రావణుడు మరణించునని చెప్పె!

పద్యం : ఇష్టదైవము ప్రార్థించి రాముడంత
అగ్ని బాణము తోడుత నతని నాభి
పగులగొట్టెను యమృత మింకిపోవ
యంత రావణు డాభువిపైన బడియె

పద్యం : శివ శివా! యను రావణు శిరమునుండి
వింత తేజస్సు వెడలి శ్రీరాము గలిసె
జగతి నెల్లను భయపెట్టినట్టి వాడు
రావణాసురు డావిధి మరణ మందె!

ఘజల్ : అనుజుని మరణము గాంచి విభీషణు
డంత కన్నీరు పొంగ
సురాసురుల బెదిరించి తుదకిట్లు
మరణించితివని యేడ్చె
యుద్ధమింక వలదని రాముని
శరణు కోరెనా లంక పక్షమున

నరులు, వానరులు, రాక్షసులెల్లరు
లంక చేరుకొనినంత
తక్షణమే రాముడు లంకకు
విభీషణుని రాజొనరించి
సముద్ర జలముల చల్లి విభీషణు
తలపై కిరీట ముంచె!

పద్యం : తనదు పట్టాభిషేకము పూర్తియైన
క్షణమె, శ్రీరాముతోడ నశోకవనిని
చేరి సీతను రాచమర్యాదతోడ
అప్పగించెను రాముని హస్తములకు!

పద్యం : జగతి పులకితమాయె, భూజాత మోము
సంతసమ్మున రాముని చూచినంత
నరులు, వానర, రాక్షస నాయకులును
సురలు తాపసు లెల్లరు సంతసించ!

పద్యం : జానకి! నీకు బంధ విముక్తి జేసి
శత్రు సంహార మొనరించినాను గాని,
నీదు మనసేమిటో మది నెరుగనైతి!
స్వేచ్ఛ నిచ్చుచు నుంటి నీ యిష్టమనియె!

పద్యం : అనుచు రాముడు యనుమాన మొందినంత
కనుల కన్నీరు ధారలై కదల సీత
లక్ష్మణా! చితి పేర్చుము లంకలోనె
ఆత్మత్యాగము చేతు నటంచు పలికె

ఘజల్ : చితిని పేర్చగా నాజ్ఞాపించెను
లక్ష్మణు డంతట వానరుల
దుఃఖ భారమున వానర రాక్షస
వీరులు ముందుకు కదలి
మనసులో బాధ దిగమ్రింగుకొనుచు
చితిని పేర్చి రా ప్రాంతమున

మమతలే మరచి అగ్ని ముట్టించి
కుమిలి యేడ్చె లక్ష్మణుడు
భగభగ మంటలు నింగికెగసె
యన్యాయముపై కసితోడ
రామనామమును తా జపియించుచు
నగ్నిపైకి నడచెను జానకి
భగభగ మండెడు మంట చల్లారి
అగ్నిదేవుడే నిలిచె ముందర
వానర, రాక్షస కోటి తమ కళ్ళు
తాము నమ్మలేకుండగా

పద్యం : సాధ్వి సీతను యనుమాన పడుట నీకు
న్యాయమా! రామ! యిది నీకు తగునటయ్యా
పరమ పావని జానకి పాప మేమి
లేని సౌశీల్య! భూజాత! నీదు భార్య!

ఘజల్ : అనుచు అగ్నిదేవుడు జానకి
నంత శ్రీరాము కప్పగించగా
నరులు, సురులు, వానరులు, రాక్షసులు
సంతోషముతో జేజేలిడగా!
యంతట శ్రీరాముడు నందరితో
సెలవు తీసుకుని పయనమాయెను!

పద్యం : ధరణి ఏకైక పుష్పకవిమాన మిద్ది!
రావణుడు ప్రేమ తోడుత దీని తెచ్చె!
ఎందరైనను దీనిని ఎక్కవచ్చు
ప్రేమ తోడుత నీకిచ్చుచుంటినయ్యా!

ఘజల్ : అనుచు రామునికి పుష్పక విమానమును
కానుకగా నిచ్చె విభీషణుడు
యానందముతో వానరు లెల్లను
దానిపై నెక్కి కూర్చునిరి!

రాముడు జానకితోడ కూర్చుండె
తనదు వెనువెంట లక్ష్మణు డుండగ
సుగ్రీవుడు, జాంబవంతుడు, హనుమం
తుడు యంగద పరివారము
జేజే పలుకగ ఎగిరె విమానము
గగన తలముపై యయోధ్య దారిని.
ఆత్మీయతతో కంట నీరిడుచు
వీడ్కోలిచ్చె విభీషణుడు
సకల జగమ్ములు శాంతి పొందగా
వెడలిరి సీతారామలక్ష్మణులు



# 13

వచనం : సీతారామలక్ష్మణులు పుష్పక విమానముపై సపరివారముగా అయోధ్య చేరుకొనగా, భరత, శత్రుఘ్నులు, మంత్రి, సామంత దండనాయకులతో ఆనందముగా స్వాగతము పలికిరి.

కౌసల్య, సుమిత్ర, కైకేయి పాదములకు శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై నమస్కరించి వారి ఆశీస్సులు పొందెను. మంచి ముహూర్తమున శ్రీరామ పట్టాభిషేకము జరిగినది. సుగ్రీవ, జాంబవంత, హనుమంతులకు పెక్కు బహుమతుల నంద జేసి శ్రీరాముడు వారిని ఆనందపరచెను.

ఘజల్ : అవనిపై యానందముప్పొంగ
శ్రీరామ పట్టాభిషేకమే జరుగ
నరులూ వానరులూ, దేవతలెల్ల వారు
ముదమార దీవన లివ్వగా,

రామరాజ్యంబు కొనసాగె కొన్నేండ్లు
ధర తాను మురిపాల తరియించగా
మురిపాలతో ప్రజలు సిరిసంపదలతో
నెల మూడు వానలు కురువంగ బ్రతుక

పద్యం : కరువు యనుమాట తెలియని ప్రజలు వారు!
కష్టమనుమాట తెలియని జనులు వారు!
సుఖము సంతోషములతోడ సుందరముగ
బ్రతికినారట! రామరాజ్యమ్మ కాదె!

ఘజల్ : నాటికి నేటికి రాముని రాజ్యము
ఆదర్శమ్మౌ భువిపైన
సుఖసంతోషము, శాంతి సౌఖ్యము
ఆనందముతో నిండిన జీవము

రామరాజ్యమున పొందిరి ప్రజలు
ప్రజల కోసమే బ్రతికెను రాముడు

పద్యం : తాను రాజని గర్వము లేనివాడు
ప్రజలు తన బిడ్డలని తలపోయువాడు:
ధరను శ్రీరాము డొక్కడే దక్షుడాయె
రామరాజ్యము ఒక్కటే రాజ్యమాయె!

పద్యం : ఒకటె బాణము ఒక్కటే మాట తనకు
ఒక్కతే భార్య: పర సతి కన్నతల్లి
కాగ పరిపాలనము సేసి ఖ్యాతి పొందె
నతడు రాముడు! శ్రీరామచంద్రు డొకడె!

పద్యం : మునుల, సాధుల కాచుట ముఖ్యమనుచు
ప్రజల సుఖశాంతులే ప్రభుధర్మమనుచు
ధర్మశాస్త్రము, న్యాయము ధరణియందు
నిలిపి పరిపాలనము చేసె నీతితోడ!



# ఉత్తర రామాయణం

## 1

ఘజల్ : రామా నీ నామమే మాకు మధురం
శ్రీరామా నీ కావ్యమే మాకు వేదం
కమనీయ నామ కళ్యాణరామ
పట్టాభిరామ కోదండరామ ॥శ్రీరామ॥

వచనం : పట్టాభిషేకమైన పిదప రామరాజ్యమున ప్రజలు సుఖశాంతులతో బ్రతుకుచుండగా కొంత కాలమునకొక వింత సంఘటన జరిగినది.

పద్యం : అరయ నొకనాడు రాముడు రాత్రివేళ
ప్రజల సుఖశాంతి పరికించ నడచుచుండ
రజకు డొక్కడు భార్యతో రగడ కలిగి
వీధిలో నిల్చి ఈ విధి పలికె తాను

పద్యం : ఎచట నుంటివి? ఎక్కడకేగి వచ్చి
నావు? ఈ రాత్రి వేళలో! నన్నుగాక
ఎవని ప్రేమించి వచ్చితి? వెక్కడుంటి?
విపుడు చెప్పుము లేకున్న విడువ నిన్ను!

పద్యం : నన్ను ఏమార్చి ఎవడికో నడక నేర్పి
వచ్చుచుంటివి యిది నాకు బాధ కాదా
వెర్రివాడను గాను నేనింక నిన్ను
యేలుకొనంచు నామెను బయటికీడ్చె

పద్యం ; అకట! రాముడు వెర్రినాగన్న గాదె
ఎన్నొ రోజులు రావణు లంక నున్న
పడతి సీతను దెచ్చియు ప్రణయ పడునె
అట్టి మూర్ఖుడనా నేను యనుచు పలికె

ఘజల్ : మాటునందుండి మాటలు విసిన
రాముడా క్షణము వివశుడై పోగ
చెవులు మూసుకొని కటకటా యని
ఎంత మూర్ఖుడను యిన్నినాళ్ళుగా
ప్రజల యభిమతము తెలియగా నైతి
ఇట్లు జానకీ వ్యామోహంబున
మునిగి తేలుచున్నాడ న్యాయమా?
యనుకొని మనసున క్షోభ పొందగా
తడబడు నడకల వడివడి నడచుచు
యంతఃపురమున చేరి చింతించె.

పద్యం : తనదు ఏకాంత మందిరమందు రాము
డరయ కూర్చుండి జానకి గూర్చి బాధ
పడుచు యోచించె నా జన్మ ప్రాప్తమేమి?
నీకు నాకును విధి యిట్లు వ్రాసె నేమి?

ఘజల్ : అంతట రాముడు తనపై నిందను
దూరము చేయగ నాలోచించి,
ఎంతొ యోచించి, జానకి నడపుల
కంపగ మనసున తీర్మానించె,
మనసునందొక్క బాధ వైదొలగె,
మరియొక ప్రక్కన దుఃఖమే తెంచె
జానకీదేవి ఎదురుగా నిలచి
ఏమి నా పాప మనుచు ప్రశ్నించి,
నిలదీసిన యట్లాయె రామునికి
నిప్పు నంటి నట్లాయె మనసులో

పద్యం : నీవు సౌశీల్య యన్నది నేనెరింగి
నిన్ను కానల కంపుట న్యాయమౌనా?
యనుచు శ్రీరాము డంతట నాత్మలోన
మిగుల దుఃఖించి విహ్వాలమాయె నంత!

పద్యం : జానకీ నన్ను చేపట్టి జన్మలోన
ఎపుడు సుఖముల నొందితివమ్మ నీవు
కరకు రాక్షస రావణుకన్న నేను
మిగుల పాపిష్ఠి వాడనో మిథిలపుత్రి!

పద్యం : శివధనస్సును విరిచి నీ చేయిపట్టి
నాను! యదె నీకు యానందమైన క్షణము
పిదప దుఃఖమ్ము కష్టముల్ తప్ప నీకు
సుఖము లెక్కడివమ్మ ఓ సుందరాంగి!

పద్యం : అరయ లంకను యారడి నంది యిపుడు
సుంత విశ్రాంతి గైకొంటి వేమొగాని,
తిరిగి యడవుల చరియించు తీరు తప్ప
దారి లేదమ్మ నీకింక ధరణిపుత్రి!

ఘజల్ : అనుచు దుఃఖించె రాముడు
ఎంతో రాత్రి గడచు నందనుక
అయిన నేమిటి యామెను యడవుల
కంపుట తప్పదటంచు తలచి,
యనుజుడు లక్ష్మణు కొరకై పనిచెను
మనుజుని, నిశ్చలచిత్తుడు గాగ
చిత్తమంచు యా సేవకు డంతట
వెడలెను లక్ష్మణు నచటికి పిలువ!

పద్యం : అగ్రజుని యాజ్ఞ మీరక లక్ష్మణుండు
కదలి వచ్చెను యారాత్రి కలత నిదుర
చెదరి నట్లాయె రాముడు చెప్పినట్టి
మాట వినినంత విహ్వాలమాయె మనసు!

పద్యం : లక్ష్మణా నీవు వేకువ నిదుర లేచి
యతివ జానకి గొంపోయి యడవులందు
విడిచి రమ్మిక యిది చక్రవర్తి యాజ్ఞ
స్వపర భేదము లేదు నా రాజ్యమందు!

పద్యం : తరుణి జానకి రావణు స్థావరమున
యచిర కాలము గడపెను యంతెగాక
చపలచిత్తుడు యాతని చెంత నుండె
యనుచు ప్రజ యెల్ల నన్నెంతో యాగి చేసె!

పద్యం : కనుల నిండుగ కన్నీరు క్రమ్మె నాకు
యతివ జానకి పతివ్రత యన్న విషయ
మెల్ల తెలియును, నీవింక మారుమాట
లాడకుండగ నాయాజ్ఞ యమలు జరుపు!

ఘజల్ : అనుచు రాఘవుడు దుఃఖ భారమున
యవని మోయుచున్నట్టి బరువుతో
తలను బాదుకునే ద్వారబంధములు
యదిరిపోవగా శిరము పగులగా!
యది గని లక్ష్మణు డంత యగ్రజుని
దుఃఖ భారమును యనునయించెను
వలదు నీవింక దుఃఖపడవలదు
యాత్మ సంఘర్షణమ్ము పడవలదు
నీదు మానసిక స్థితి నేనెరుంగుదును
చిత్తశాంతమును పొందుమా యింక
నీదు యాజ్ఞ శిరసావహించెదను
రాజనీతికే విలువ యిచ్చెదను.
తల్లి సీత నా కానల యందున
తరలగా జేసి తిరిగివచ్చెదను
ఆత్మ సంక్షోభ మంతరించగా
యింకనైన విశ్రాంతి పొందుము
మనసు నిశ్చలము చేసుకొను మింక
శిరోభారములు తొలగిపోవును!

పద్యం : అనుచు లక్ష్మణు డంతట యాగ్రహమ్మ,
నిస్సహాయత, నిర్లిప్త, నిర్వికార
హృదయ భారములందున వెనుక తిరిగి
నడచిపోయెను దుఃఖము నాపుకొనుచు;

ఘజల్ : దైవమా! నీదు దుర్మార్గ మేమంచు నిందింతును
మానవులె నీకు వేధించగా యుండిరా యంచును ॥దైవమా॥

కాలమా! నేను సాక్షినై వివరింతునూ
రాజులకు ఎంత స్వార్థమొ వినిపింతును ॥దైవమా॥

కళ్ళముందున్న సత్యమే కన్పించదు!
న్యాయమేదైన వీరికి విన్పించదు!
ఎక్కడో ఎవ్వడో ఏదో యన్నాడని
ఎన్నడో ఏదో ఆచారమై ఉందనీ
యిట్లు పరిపాలనము సేయుచున్నారని
ఎట్లు ఎదిరించగలనమ్మ పాపిష్టి పనిని! ॥దైవమా॥

పద్యం : నేను సేవకుడనుగాన పాప మేమి
నాకు! యనుకొందునా లేక తిరగబడన?
యనుచు లక్ష్మణుడా రాత్రి కాలమెల్ల
మిగుల దుఃఖించె బాధ్యత మీరలేక!

పద్యం : ఉదయ కాలమునందున లేచి నడచి
జానకీదేవి మందిరమందు నిలచి
అమ్మరో నిన్ను ముని కుటీరమ్మ లెల్ల
చూడ పంపించమని చెప్పె రాఘవుండు!

ఘజల్ : అనుచు లక్ష్మణుడు వడివడి చెప్పుచు
ముఖము తప్పించి నిలువగా
తన కోరిక రాఘవుడీ విధి
తీర్చెననుచు సంతోషించి

తరుణి జానకి సంతసముతోడ

వడివడి పయనమ్మాయె నడవికి

రథముపై కెక్కి యానందముతో

ధన్యవాదములు తెలిపె నతనికి

యాత్మ సంతోషమందు జానకిని

గాంచి బాధగా నవ్వె లక్ష్మణుడు

రథముపై నున్న నిండుగర్భిణి

జానకి సంతోషమును

క్షణకాలమ్మున గ్రుంగదీసెనా

రథసారథి; వార్తాహరుడు!

పద్యం : తొలుత మన్నింపుమమ్మ ఈ సేవకుడను
నేను రాజాజ్ఞ చెప్పుచునుంటి యిపుడు
నిన్ను కానల లోపల విడిచిపెట్టి
తిరిగి రమ్మని కోరెను రాఘవుండు!

ఘజల్ : అనుచు లక్ష్మణుడు తెలుపగా వినెను

సాధ్వి సీత క్షణకాలమున

భూమి బ్రద్దలై చీలిపోయినట్లు

హృదయ మెల్ల సంక్షోభమున

క్రుంగిపోవగా లెస్స దుఃఖించె

జానకీదేవి యంత రథమున

పద్యం : లక్ష్మణా నేను చేసిన నేరమేమి?
ఎందుకీ ఘోరశిక్షను వైచినాడు
తెలుసుకొన గోరె నా మనసెంతయైన
న్యాయమేగద నిందితురాలికైన!

ఘజల్ : కన్నుల దుఃఖము పొంగగా

రథమునాపి దిగెను లక్ష్మణుడు

చెట్టు నీడలో దించి సీత నట

పచ్చికపై కూర్చుండ జేసి

రజకుడొకడు నిందారోపణ
చేసినాడనుచు తెలిపె రాఘవుడు
మనసు క్రుంగగా తలను బాదుకొని
ప్రజాభీష్టమని తలచి
ఎంతొ యోచించి, సుంత దయలేక
యింత దారుణము చేసినాడమ్మ
నేను సేవకుడ నేమి సేయగల
వాడనోయమ్మ నిస్సహాయుడను
రాజు యాజ్ఞ శిరసావహించితిని
వెడలి పోవుచున్నాడ నిప్పుడు
యనుచు లక్ష్మణుడు మిగుల దుఃఖించి
జానకీదేవి పాదముల తాకి
రెండు చేతులతో వందన మిడెను
దుఃఖభారమున వెనుక తిరిగెను.

పద్యం ; హృదయ వేదన తనలోన దాచుకొనుచు
లక్ష్మణా! వినుమింక నా చివరిమాట
లనుచు జానకి ఈ విధి పలికె తాను
రామనామము దప్పనే నన్యమెరుగ!

ఘజల్ : ధరలో మహిళగ జన్మించుటయే నేరమా!
జగతికి ప్రగతికి మహిళతోడ పనిలేదా? ॥ధరలో॥
తొలగినదా రామునిపై బడినట్టి యపప్రథ
జానకి నడవుల కంపినంత; సుంతయేని మిగులక ॥ధరలో॥
కలత పడక నేనడవులలో యాతని
వెంటనంటి నడచితి నానాడు
కష్టసుఖమ్ములు కలసి యనుభవము
పొందిన పడతికి ఫలితమిదా? ॥ధరలో॥

పద్యం : పాపమొ పుణ్యమొ నేడు యిట్లు జరిగె
అయిన నేమిటి యాతని యాజ్ఞ నాకు
వేదవాక్కని చెప్పుము వేనవేల
వందనాలని చెప్పుము రామునకును!

పద్యం : అత్తలందరకును వందనమ్మ లనుము
ప్రజలు సుఖశాంతులను పొంద పలికె ననుము
దేశమాయెడ సుభిక్షమ్మగాగ సీత
ధరణి తల్లికి వందన మిచ్చెననుము!

ఘజల్ : అనుచు జానకీదేవి లక్ష్మణుని
కనుల నీటితో సాగనంపగా
పరిపరి విధముల మనసు క్రుంగగా
రథమును నడిపెను లక్ష్మణుడు
మార్గమధ్యమున తనదు జీవితపు
పాపపంకిలము తలచుకొని
భారముగా తల బాదుకొనుచు
కొనసాగెను అయోధ్య పురికి!



# 2

పద్యం : జాలిగా చూసె జానకివైపు తిరిగి
యడవి యందలి జంతుజాలములు తాము
జాలిగా వీచె జానకివైపు తిరిగి
యడవి యందలి వృక్షసంజాతమెల్ల!

ఘజల్: 1. కనుల నీరు క్రమ్ముకొనగ కదిలె మేఘమాల!
చినుకు చినుకు జారిపడగ చెదరిపడెను వాన! ॥కనుల నీరు॥

2. ఆగ్రహమ్ముతో ఆకసమ్మెల్ల ప్రతిధ్వనించగా!
మెరుపులతో, ఉరుములతో ప్రకృతి పలకరించగా!
నిస్సహాయ, నిస్పృహ. నిస్తేజమైన సీత
ప్రకృతిలో కలసిపోవ ప్రయత్నించె భూజాత! ॥కనుల నీరు॥

3. అపుడు అక్కడకు చేరెను
దైవదూత వాల్మీకి
మహామౌని పురుషోత్తము
డంతట జానకి నోదార్చి
దుఃఖ భారమున నుండిన సీతను
నంత యోదార్చె నతడు
నాకు తెలుసు నోయమ్మ
నీదు కథలూ, వెతలూ
నీవు పతివ్రతవైన నేమిటి
కాలసర్పమే కాటు వేసినది
ఎంతవారికైనా తప్పదు
కొంత కాలమే విధి నిర్ణయము
కలవరపడబోకు మమ్మ
కష్టములే తొలగిపోవు

రాజే యొకనాడు నిన్ను
రారమ్మని యర్థించును
తనదు తప్పు తెలుసుకొనును
నిన్ను క్షమాభిక్ష యడుగు
అంతదనుక నాయాశ్రమ మందు
సేద దీరు మమ్మ
తల్లిగ, తండ్రిగ, గురువుగ,
నన్ను చూసుకొనుమమ్మ ॥కనుల॥

పద్యం : అనుచు వాల్మీకి మౌని తా నభయ మీయ।
దైవమా నాదు దౌర్భాగ్య మేమిటంచు
తరుణి జానకి వాల్మీకి వెంట నడచి
యాశ్రమంబును చేరెను యతని వెంట।

పద్యం : లెండు। మునిపత్నులార మీ రెన్నడేని
చూడలేనట్టి యతిథిని చూడ రండు
యాశ్రమమ్మెల్ల పావన మాయె నేడు
పరమ పతివ్రత సీత తా నిచట నిలువ।

ఘజల్ : అనుచు వాల్మీకి మౌని పత్నులకు
జానకి పరిచయ మొనరించి
ఈమె గర్భవతి, రాజమాత
రానున్న కాలమున మనకు
మనసు దీర శుశ్రూష లొనరించి,
మానవత్వమును చాటుడు
రాజరాజు శ్రీరామచంద్రుడు
తప్పక వచ్చును మనకడకు

పద్యం : ఎన్నడో ఎప్పుడో రాము డిటకు వచ్చి
మనదు శుశ్రూషలకు ధన్యవాద మిచ్చు
ఇది భవిష్య పురాణము రిత్త గాదు
కనుక జానకి తోడుగ కాంచగలరు।

ఘజల్ : అంత జానకిని ఆశ్రమ వాసులు
ఆనందముతో స్వాగతించిరి,
తమదు యౌదార్య సద్గుణములతో
సంతసింపగా చేసిరి
దుఃఖ భారమును మరచి జానకి
తిరుగులాడునటు చేయగలిగిరి!
అంత మునిపత్ను లందరి తోడుత
కలసి పోయె నా జానకి
తనదు దౌర్భాగ్య దుఃఖభారములు
తొలగించుకొనెను వారితో కలసి

ఘజల్ : ఎంత ప్రశాంతమూ, మనశ్శాంతమూ
చిత్తమున కెల్ల కలిగేను విశ్రాంతిమూ
తాపసుల జీవనము స్వేచ్ఛతో ధన్యమూ ॥ఎంత॥

రాచరిక మందు ఏముంది అధికారమూ
పాప పరిహారమూ పుణ్య పరిహారమూ ॥ఎంత॥

రాజ్య పరిపాలనము ముళ్ళ కిరీటమూ
ఓర్పు, ఓదార్పు లేనట్టి రణక్షేత్రమూ
సుంత జాలైన చూపించ లేనట్టిది
స్వంత సతినైన విడనాడు మనునట్టిది ॥ఎంత॥

ఎందుకో రామ నీ కంత మమకారమూ
అట్టి సింహాసనము మీద వ్యామోహమూ
రాజ్యమును వీడి రావేల నాకోసమూ ॥ఎంత॥

ఎందుకో నీకు ఆ ముళ్ళ కిరీటమూ
ప్రేమ యభిమానమే లేని జంఝూటము
రాజ్యమే కాదు అది మానవారణ్యమూ
ద్రోహులును మూర్ఖులను ఉన్న దుర్‌క్షేత్రమూ ॥ఎంత॥

నీవు నా కోసమే నన్న ప్రేమానురాగం
ఎంత సంతోషమూ, గొప్ప ఉత్ప్రేక్షము ॥ఎంత॥

పద్యం : అనుచు జానకి ఎంతొ యోచించె నంత
మనసు పరిపరి విధముల సంచరించ
దుఃఖమో దైన్యమో తెల్పలేని విధిని
సంచరించెను యాశ్రమమెల్ల తాను!

పద్యం : పూలతో స్వాగతమ్మిడు పుష్పవనము
రుషుల కాహ్లాద మొనరించు రుతుపవనము
పిల్లతెమ్మెర లెగసెడు కొలను నీరు
దైవమా! స్వర్గ మింకెందు గలదు చెపుమ?

ఘజల్ : తనదు యదృష్టమే యిది
యనుకొని సంతసించె నా సీత
పాత జ్ఞాపకము లన్ని తొలగించి
సంతసముతోడ నడచె భూజాత
ఈ విధి దినములు
క్షణములుగా గడవంగ
నవమాసమ్ములు మోసి కవలలకు
జన్మనిచ్చెనా ధన్యచరిత్ర!

పద్యం : ఆశ్రమమ్మెల్ల యానందపడెనుగాదె
యతివ జానకి ముద్దుల మూటగట్టు
రాకుమారుల నిద్దర రక్షసేయు
భాగ్యమే దక్కెనంచును భావ మలర!

పద్యం : లవుడు, కుశుడని, నామకరణమ్ము జేసె
తనదు యమృత హస్తముతోడ మౌని
రాజభోగము లేకున్న నేమిగాని,
ప్రేమ తోడుత పెంచె వాల్మీకి మౌని!

ఘజల్ : రాజ్యమేల - రాణివాసమేల
అంతఃపుర కాంత లేల యా బాలురకు
అంతటా అభిమానమే
పెంచుకున్న ఆశ్రమమే చాలును

అద్భుతమగు ప్రేమ కన్న
పొందదగిన సిరులేమున్నవి?
మునిపత్నులకన్న వేరు
దాస దాసీ జన మెక్కువా?

పద్యం : మునిపత్ను లందించు ప్రేమకన్నను మించు
ప్రేమ వేరొండు కలదె ఈ దేశమునను
వాల్మీకి కన్నను వసుధలో గొప్పగా
వెలుగు వాడెవడురా లాలనమున?
ఆశ్రమంబుల మించు ఆప్యాయతలు చూపు
మందిరము లేవిరా మనుజులకును?
వృక్ష సంతతి మించి ఫలమును మించి
ఆహార్య మేదిరా ఆత్మలకును?

పద్యం : మనుజ జాతికి విశ్వవిహార మందు
సిరులు సంపద లెందుకు చిత్తశాంతి
నిచ్చు యాశ్రమములకన్న నిక్కముగను
లేదు వేరొండు దారి ప్రపంచమునను!

ఘజల్ : కాలగమన మది; దానినాపగ సాధ్యమా?
దినములు మాసములేండ్లు గడిచెను
శుక్ల పక్షమున చంద్రబింబముగ
దిన దినమ్ము నొక దీక్షగా
వెలిగి పెరిగిరా బాలవీరులు
వాల్మీకి చెంతనా విద్యార్థులు ॥కాలగమన॥

సకల విద్యలను చదువనేర్చిరి
యుద్ధ విద్యలను సాధన చేసిరి
పెరిగి పదునాలుగేండ్ల ప్రాయమున
చిరు యవ్వన వీరులుగా నిలచిరి! ॥కాలగమన॥

# 3

పద్యం : సకల విద్యలు యుద్ధ కావ్యమ్ము లెల్ల
సకల శాస్త్రమ్ములున్ భాషలెల్ల; తాను
నిలచి, నేర్పించె నా బాలవీరులకును
ఔరః వాల్మీకి తన శక్తియుక్తి జూపః

ఘజల్ : విల్లు నమ్ములన్ చేతబూనిరా
విష్ణువైన దిగదిదుపే
కరవాలమ్మే పట్టి నిల్చిరా
కమలాక్షుడు వెనుకడుగే
ముష్టి యుద్ధమే చేయదలచిరా
మురహరి యింక పరుగేః
అశ్వారోహణమన్న వారి కిక
ఆనందపు జలక్రీడే ॥విల్లు॥

పద్యం : సకల శాస్త్రమ్ములన్ యుద్ధ విద్యలందు
సవ్యసాచులు; వీరులు, ధీరవరులు
లేరు లవకుశులను బోలు వీరవరులు
సాటి రాలేరుః భువిని ఎవ్వారుగానిః

పద్యం : ఒకడు వాయువు వేరొక డగ్ని గాదె
ఒకడు సంద్రము వేరొక్క డలలు గాదె
ఒకడు వర్షము వేరొక్క డురుము గాదె
కలసి తెగటార్చు వీరులు గాదె వారు;

ఘజల్ : తల్లి జానకి తనయులను జూచి
సంతోషము ఉప్పొంగ

మెల్ల మెల్లగా గత స్మృతులు
తన మది లోతుల నిలువంగ
ఒక పరి దుఃఖము;
వేరొక పరి యానందముతో
తనదు జీవితము మహాసముద్రము
దుఃఖభారముల యలల భరితము
యనుచు తలపోసి యంత చింతించె
సాధ్వి సీత తన కుటీరమ్మునః ॥తల్లి॥

కాలగమనమున వార్ధక్యమ్మె
తనను ముట్టడించగ
ముగ్గుల బుట్టయి - ముదిమి వగ్గయి
ముదుసలి నడకలు నడువంగ ॥తల్లి॥



పద్యం : అదె అయోధ్యాపురి శ్రీరాము డతడు గాదె
దుఃఖభారమ్ముననన్ ముది వగ్గు వోలె
కలత జెందుచు రాజ్యభారమ్ము తాను
మోయలేనని చింతించుచుండె గాదె!

ఘజల్ : సతిని వీడి పదహారేడులు
కాలగమనమున కలసిపోయెను
సాధ్వి సీత ఏమైనదో గదా
క్రూరుడను దుర్మార్గుడను దుశ్చరితుడను ॥సతిని॥

అనుచు రారాజు మిగుల చింతించె
కలత నిదురలో కలవరించెనూ
పీడకల బడిన యట్లు పిచ్చిగా
లేచి కూర్చుండె మనసు క్రుంగగా ॥సతిని॥

పద్యం : జానకీ నీకు చేసిన పాపమునకు
దైవ మీ విధి నన్ను శిక్షించుచుండె
ఎచ్చటైనను ఉంటివో లేదొ; తెలియ
లేను, నన్నిక క్షమించలేవు నీవు!

పద్యం : రాజు ధర్మము కాచుట రాజు యొక్క
బాధ్యతని యిట్టి పాపము జేసినాను
సతిని కాపాడుటన్నది పతికి యున్న
బాధ్యతని యెంచలేనైతి నేమి సేతు!

ఘజల్ : సతిని యడవులం ద్రోసినట్టి యా
పాప ఫలితమే నేడు
ఈ విధి మనసును క్రుంగదీసినది
ప్రాయశ్చిత్తము లేదు!

యనుచు తల బాదుకొనుచు
శ్రీరాము డంత లక్ష్మణుని బిలచి
తక్షణమే సచివుల, యోగుల
సమావేశ మేర్పాటు చేయనె ॥సతిని॥

పద్యం : ద్వాపరిక మేల మౌనులు, మంత్రులార;
కలత పొందెను నా మన సెంతయేని
జానకీదేవి కే నెంతొ ఘోరమైన
పాపమే చేసినాను ప్రాయశ్చిత్త మేమి?

ఘజల్ : అనుచు శ్రీరాము డడుగగా మునులు
కలత బడిరి కన్నీరు లొలుకగా
సచివులు. సామంతులు, మిత్రులు
మేధావులు మనసున క్రుంగగా
తలచి. తలచి, శ్రీరామ భూవరుడు
ప్రాధేయపడుచు ప్రశ్నించగా
అశ్వమేధ యాగమును జేయుమని
తాపసు లందరు స్ఫూర్తి నిచ్చిరి
తక్షణమే యాగము చేయగా తలచి
రాము డాజ్ఞలను ఇచ్చెనంతట!

పద్యం : పసిడి సీతను చేయించి ప్రక్కనుంచి
తనదు కన్నీటితో యభిషేక మిచ్చి
యాగమును పూర్తి చేసెను రాము డంత
సురలు, నరులును పొగడగా స్ఫూర్తి తోడ!

ఘజల్ : యాగమైన తన జానకిని తనకు
తోడు నీయగల దనుచు
యాగాశ్వమ్మును ప్రపంచ వీధుల
విడుదల చేసెను రాముడు
అశ్వ సంరక్షణార్థి శత్రుఘ్ను
డంత వెనువెంట నడువ

విశ్వవిహారము చేయగా నిలిచె
యాగాశ్వము ధారుణిలోన!

పద్యం : అశ్వరాజమ! నాయందు దయను గలిగి
అఖిల రాజ్యములన్నియు తిరిగి తిరిగి
జానకీదేవి జాడను తెలుపుమమ్మ
యనుచు రాముడు వందన మిడెను గాదె!

పద్యం : యిది మహావీర శ్రీరామ చక్రవర్తి
యశ్వమేధము చేసిన యశ్వరాజ
మిద్ది యెవ్వారు నిలిపిన గాని శిక్ష
యనుభవింపక తప్పదటంచు వ్రాసి
యశ్వముఖమున తగిలించి యంత దాని
విడిచి పుచ్చెను శ్రీరాము డాత్మ మురువ!

ఘజల్ : చెలగి యాగాశ్వ మల్ల నెల్లెడల
రాజ్యము లెల్లను తిరుగ
భయపడి రాజులు అశ్వరాజమును
జూచి తలవంచి విడువ
అశ్వ మా విధిని విశ్వవిహారము
చేసి నడయాడుచుండ
అరణ్య ప్రాంతమునందు వాల్మీకి
యాశ్రమ ప్రాంతము జేర
అల్లనల్లన యాడుకొనుచున్న
లవకుశులశ్వము జూచి
ఏమిరా యనుచు యశ్వరాజమును
యాపి తలవ్రాలు చదవ!

తెలిసిపోయెనా బాలవీరులకు
యది శ్రీరాముని యశ్వరాజమని
దాని నాపుటకు శక్తి లేకనే
ధారుణీ పతులు విడిచినారని

యందువలన ఈనాటికి దానిని
యాపెడు వీరుడు కనబడలేదని
కనుక తామైన దాని నాపంగ
స్థిర నిర్ణయమే చేకొని రిద్దరు॥

పద్యం : అతడు శ్రీరాము డాతని యశ్వ మాపి
కట్టివేసిన కీర్తిని పొందవలెను
లేదా, యాతని శక్తిని చూడవలయు
ననుచు బాలురు యశ్వము పట్టివేయ॥

ఘజల్ : యిట్టి సాహసము బాలురు చేయుట
గాంచి శత్రుఘ్ను డంత
తప్పు నాయనా! యిది శ్రీరాముని
యశ్వమేధ యాగాశ్వ రాజము
దీని బంధించినంత నాతోడ
యుద్ధము చేయగవలెను
తెలిసి చేసినా తెలియక చేసిన
మీరు బాలకులు గాన
ఇపుడు క్షమియించుచుంటి
నిక దాని విడిచి వెళ్ళుడని పలికె

పద్యం : బాలలము కాము బేలల మేమి కాము
ధరను శ్రీరాము నెదిరించి చూడగోరి
సమరమైనను సేయగ శక్తి కలిగి
అశ్వరాజము బంధించినారమయ్య!

పద్యం : తెలిసి చేసితి మిద్దాని తెలివి లేక
చేయలేదయ్య యుద్ధము చేయగలము
నీవు గాకున్న నీయన్న రామచంద్రు
డెవరు వచ్చిన మాకేటి గెలువగలము॥

ఘజల్ : చేయగలరేని చేయుడు యుద్ధము
లేని పక్షమున వెళ్ళుడు రాజ్యము

వెళ్ళి మీ ప్రభువు కిట్టి దుర్వార్త
తెలిపి బలగమును తెచ్చుకొను డింక
యనుచు బాలకులు పలుకగా నలిగి
పట్టరాని కోపముతో శత్రుఘ్నుడు
తనదు బలమెంతొ చూపగా దలచి
బాలలపై శరసంధానము చేసెను.

పద్యం : బాలకులుగారు వీరులు భళియటంచు
రిపులు మెచ్చగ యుద్ధము చేసిరంత
అశ్వరక్షకుడైన శత్రుఘ్ను డింత
క్రింద పడి పోయె స్పృహ తప్పి మూర్ఛ నందె!

పద్యం : అవని బడినట్టి శత్రుఘ్ను డంత తాను
తేరుకుని యట్టి వార్తను రామచంద్రు
డెరుగగా బంపె సైనికు డొకని నంత
వెంటనే వచ్చె భరతుడు యుద్ధమునకు

పద్యం : భరతు డేమిటి, లక్ష్మణుడైన నేమి
వరుసగా పరాభవ మందిరంత. ఔరా!
బాలకులను గెలువంగ లేర! యనుచు
రాము డంతట రథమున నటకు చేరె!

పద్యం : అనుజులందరు ఓటమి చెందియుండ
జూచి, శ్రీరాము డాశ్చర్య మందెనంట
ఎవ్వరా వీరులని తాను జూచెగాని
బాలకులు యిద్దరేయని నవ్వుకొనెను.

ఘజల్ : నునులేత వయసులో నున్న బాలలు మీరు
నను వంటి వీరుని గెలువగా జాలరు
పట్టుదలకేగి శ్రీరాము నాగ్రహమ్ము
పొందకుడు నాయనా! సంధి చేసుకొనుడు

పద్యం : ఎవరు మీ తల్లిదండ్రులు ఎవరు గురువు
లెస్సగా నేర్చియున్నారు యుద్ధ విద్య
లెండు! పంతమ్ము విడనాడి వెళ్ళిపొండు
అశ్వమును యప్పగించుడు బాలలార!

ఘజల్ : అనుచు రాఘవుడు ప్రేమతో బలుక
బాలకులు నవ్వి యాగ్రహము జూపి
తల్లిదండ్రులు గురువులు. మిత్రులు.
బంధువులతో పని యేమిటి యిట
తగుదువో లేవొ రణమునకు చెప్పు
మనుచు గద్దించి పలికి రంతట!

పద్యం : తనయు లొకవైపు పోరగ, తండ్రి వేరు
వైపు రణమున నిలబడి పోరు సలుపు
విధము గాంచగ దివిని దేవతలు గూడి
కనిరి చిత్రము, విశ్వవిచిత్రమ్ము గాగ!

ఘజల్ : అంత వాల్మీకి విషయమెల్ల
కనుగొని పరుగున వచ్చి
ఆగు రాఘవా! రణము సేయుటకు
వైరి వరు లెవరు లేరు లేరనియె.
వీరు బాలకులు, నీదు పుత్రులే
యనుచు వివరించెనంత!

పద్యం : వీర లిద్దరు నీదు కుమారు లయ్య!
అడవిలోనున్న జానకి నపుడు నేను
రక్షణము జేసి యాశ్రయ మిచ్చినాను
అచట! కనలలు జన్మించి రంత నాడు!

ఘజల్ : పదహారేడుల క్రితము వీరికి
లవకుశులని నామం బుంచి

పెంచుచుంటి నీ యాశ్రమ వాటిక
యందు ప్రేమతో పిలచి,
సకల శాస్త్రములు, యుద్ధ విద్యలు
వేద వేదాంగ పాఠ్యగ్రంథములు
నేర్పినాను నీ పుత్రులు వీరలు
జగతి నేలగల ధీరులు శూరులు
ముదముతోడ చేకొనుము వీరిని
సాధ్వి సీతతో కలసి బ్రతుకుము
యనుచు వాల్మీకి తెలుపగా వినిన
రాముడానంద పారవశ్యమున
కనుల కన్నీరు జాలువారగా
తనదు పుత్రులను కౌగిలించుకొనె!

పద్యం : మునివరా! నీకు కృతజ్ఞత లటంచు
రాము డానంద మందస మందు నిలచె
తనదు తనయుల గాంచి యొకింత గర్వ
మాత్మ యానంద మంద కన్నీరు గార్చె!

ఘజల్ : ఆనందం! ఆశ్చర్యం! ఆహ్లాదం!
అలుముకొన్న రాముని మదిలో
కలిగె కడలి యలలు పొంగినట్లు
ఎదను మధుర భావన లుప్పొంగినట్లు ॥ఆనందం॥

తండ్రి తనయు లందరు కలువ
వనదేవత లానందముతో
పూల వాన కురిసించగా
ధరణి మేను పులకించగా ॥ఆనందం॥

కదలి వచ్చె జానకి రాముని గని.
కడలి లోన నది కలసినట్లుగా
యిరు మేనులు పులకింతలతో
కరములు కనులంతట కలువ! ఆనందం॥

పద్యం : మౌని వాల్మీకి జానకీ జనులతోడ
సుతులు, సోదరు లెల్లరు వెంట రాగ
తరలె నా యయోధ్యాధిపుడంత తాను
చేలె తన రాజ్యమున్ ప్రజలెల్ల మురవ



మంగళం

మంగళం కోసలేంద్రాయ
మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ
సార్వభౌమాయ మంగళం ॥